# శ్రీ గిరిజా కల్యాణము



వెల: 2—50

నటక కవయిత్రి,
గంటి కృష్ణవేణమ్మ

# శ్రీ గిరిజా కల్యాణము



సరస కవయిత్రి,
గంటి కృష్ణవేణమ్మ

మహాకవి - శతావధాని
గడియారము వేంకటశేషశాస్త్రి
ఉపాధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

'శివభారత్'
D. 23 కో, ఆపరేటివ్ కాలనీ
ప్రొద్దుటూరు.
కడప జిల్లా ఆంధ్ర ప్రదేశ్.
తేది 26-1-70.

## శ్రీ శ్రీ గంటి కృష్ణవేణమ్మగారి గిరిజా కల్యాణమునకు

# శుభాశీస్సులు

గీ॥ కమ్ర కవితాపదారత్న కంకణంబు
కరమునందాల్చి లోకోపకార కృతుల
శారదా పీఠమర్చించు సరస మతివి!
కృష్ణవేణమ్మ! నీసాటి యెవ్వరమ్మ!

గీ॥ తల్లి - సాహిత్య సత్కవితామతల్లి,
తాత - సద్గ్రంథ కావ్యనిర్మాత - నాగ
పూడి కుప్పుసామయ్య; నీపుస్తకమునకు
నితరులొక మాటవ్రాయఁ బనేమిగలదు!

క॥ విరచించినావు కమ్మఁగ
గిరిజా కల్యాణకృతిని: కింకవిరాజకే
సరులైనఁ జదివి మెప్పుల
గురియింతురుగాక - తప్పుగొనఁ గలుగుదురే!

క॥ భావాలాపమ్ములు పుం
భావ సరస్వతులకట్లు ప్రభవించెను నీ
యీవాగ్ధోరణి సరసక
ధావర్ణనలందు నెందుఁ దాండవ మాడున్

గీ॥ సంతసించుటయేమి - నీ సరసమధుర
చారు ఫణితికి - సాహిత్య సంస్థయౌన
కాడమీ సాహాయ్యమిచ్చె; లోకము గ్రహించి -
చదువుదురుగాక! నీపూన్కి సఫలమగుత!



ప్రొద్దుటూరు
26—1—70

గడియారము, వేంకట శేషశాస్త్రి,
(సాహిత్య అకాడమీ ఉపాధ్యక్షుడు)

" GIRIJA "

30 Edward Elliot Road

MYLAPORE,

MADRAS-4,

30-12-69

Dear Madam,

Dr. S, Radha Krishnan has asked me to acknowledge with thanks the receipt of the book sent by you and to say that he wishes you well. The description of Nature, characters and incidents is delicate sweet and interesting.

Yours Sincerely,

**Dr S Radha Krishnan,**

Ex-President,

శ్రీ మతి గంటి కృష్ణ వేణమ్మ గారికి,
రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ నమస్కారములు.
ఉభయ కుశలోపరి.

తల్లీ!

విశ్వాసముతో మీరు పంపిన మీ గిరిజా కల్యాణము ప్రతి నందు కొన్నాను, ధన్యవాదములు.

చిరకాలము సాగించినది సాహితీ వ్యాసాంగముచే పరిణత మైనది మీరచన ఇది మీచిన్న నాటికావ్యము అగుట మీ జన్మాంతర శారదా సేవను మీగురువర్యుల మంగళశాసన ప్రభావమును చాటుచున్నదని నానమ్మిక సందర్భములు కల్పనలు శైలి అన్నియు ప్రాచీన తెలుగు మహాకవులను పదేపదే చదువరుల తలపునకు తెచ్చుచున్నవి. ఈసిద్ధికై మిమ్ము హార్దముగ అభినందించుట తప్ప ఎక్కువగా నేను వ్రాయగలిగిన దేమియులేదు.

తిరుపతి, మీ వాఁడగు,

29—1—70. రాళ్లపల్లె అనంతకృష్ణశర్మ.

---

డాక్టర్ దివాకర్ల వేంకటావధాని M A (Hons) Phd
**Professon and Head of the Telugu Department**
**Osmania Univercity, Hyderabad 7.** 2-1-70

అనేక నమస్కారములు,

తాము దయతోఁ బంపిన "గిరిజా కళ్యాణము" ను జదివి యానందించితిని. విమర్శకాగ్రేసరులు, కవిపుంగవులునైన కీ॥ శే॥ నాగపూడి కుప్పుస్వామయ్యంగారి శిక్షణ దోహదమున నంకురించి పెరిగిన తమ కవితాలత సురభి కుసుమ సౌరభముచే రసజ్ఞులు నలరించుటలో నచ్చెరువులేదు. తమ రచనాధారా శుద్ధి శోభితమై, సరళ సుందరమై యింపు నింపుచున్నది. తామింకను రసవత్తర కృతులు రచించి యాంధ్రభారతి కభినవా లంకృతులుకైసేయుదురు గాక!

దివాకర్ల వేంకటావధాని.

M. Ananthasayanam Ayyangar

31, G. M. Street,
TIRUPATI

31-12-69

Dear Smt. Krishna Venamma Garu,

Many thanks for a copy of 'Girija Kalyanam" which you so kindly sent me, I have gone through a portion and I find the topic interesting the language easy the verses flowing and theideas and the comparisons of an excellent order. Many stanzas contain original ideas and the similes and metaphors are of high order. The description of Nature, characters and incidents is delicate, sweet and interesting. You richly deserve the title of a "Sarasa Kavayitri"

I pray to Lord Venkateswara to grant you strength, health and long life to serve the cause of poetry and litera-ture in an ever-increasing measure,

Please accept our Heartiest Greetings for a Happy New Year and convey the same to the members of your family. My wife joins me in sending you these Greetings,

With kind regards,

Yours sincerey.
(M, Ananthasayanam Ayyangar)

శ్రీమతి సోదరి గంటి క్రిష్ణవేణమ్మగారు సుప్రసిద్ధ కవయిత్రీమణి

సుమారు 20 సంవత్సరములనాడు వారి పరిచయ భాగ్యము నాకు లభించినది నేను ఆంధ్రకవయిత్రులు గ్రంథము వ్రాస్తువున్న రోజులవి. శ్రీమతి కృష్ణవేణమ్మగారు రచించిన జ్ఞానప్రసూనాంబికా శతకమును, చదివి అతి శ్లాఘనీయమైన వారి ఆ రచనచే నేను ఆకర్షితురాలనైతిని. తరువాత వారితో జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములలో వారిచే రచింపబడిన గిరిజా కల్యాణము అముద్రితముగా వారివద్దనే యున్నదని తెలిసికొంటిని. తరువాత ఆకావ్యమును కోరి తెప్పించుకొని జదివెడు భాగ్యము గలిగినది. గిరిజాకల్యాణము సరస రసప్రచుర బంధమైన ఒక మనోహర ప్రబంధము. కథావస్తువు ప్రాచీనమే అయినను అందలి వర్ణనా సౌందర్యము, రచనా వినూత్నత, మిక్కిలి యాకర్షణీయమై నన్ను ముగ్ధురాలి నొనర్చినవి ఆధునిక కాలమున ఇంతటి మహనీయమైన కవిత చెప్పగల కవయిత్రీమణి యుండుట కచ్చెరువొందితిని. తరువాత ఆప్రబంధమును ముద్రింప జేయకోరుతూ వారిని నేను కోరి యుంటిని నా ప్రార్థనను మన్నించి ఆంధ్రప్రదేశ్ సాహిత్యా అకాడమీ అనుబంధ శాఖయైన మారచయిత్రుల సంఘము వారి ప్రోత్సాహము నందుకొని ప్రచురించుటకు వారు అంగీకరించి నందుకు వారికి నాధన్యవాదముల తెలుపు చున్నాను.

సోదరి
ఉభయభాషా ప్రవీణ
ఊ॥ లక్ష్మీకాంతమ్మ.

# మనవి.



ఈ గిరిజా కల్యాణము నా చిన్ననాటి కావ్యము. ఆంధ్ర సారస్వతములోనే నడుగుపెట్టిన తొలి, మలి, కాలములో వికసించిన పుష్పము. అప్పటికింకను నేను చదువవలసిన కావ్యములు-మహా కావ్యములు అలంకారములు ఇత్యాదిగా నెన్నియోకలవు. కాని నాఁటి నా యాతురతకు — మా గురువుగారిచ్చిన దోహదమునకుఁ బ్రతిగా నీకావ్యము వెలసినది, ఇందుకు నాలోనున్న శక్తికంటె—నాకు సర్వ విధముల నాశ్రయమిచ్చి ఆదరించిన గురుపాదులు — తాతగారు, విమర్శకాగ్రేసరులు మహాకవులునగు బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుస్వామయ్య మహోదయుల వాత్సల్యమును గొనియాడుచు నమశ్శతము లర్పించు చున్నాను.

ఈ కావ్యమునకు మూలము కాళిదాస మహాకవి రచించిన కుమార సంభవ కావ్యము. ఆ పేరు చెప్పికొనుటే ఈ కావ్యమునకు గౌరవావహమని భావించుచున్నాను. కాని యందులోనున్న మహదాశయములలో శతాంశమైన నీ కావ్యములో నుండదు — కాని అందులోఁ జెప్పనివి యిందులో సహజముగనే దొరలియుండును. వాని గుణదోష విజ్ఞానము విజ్ఞ శేఖరులకే వదలు చున్నాను. ఆ మాత్ర ముత్పాదకముగా నా మనోవీధి నిల్చిన యా కావ్యము నందఱివలెనే నేను నారాధించు చున్నాను.

ఇప్పటికీ రచన యొక కావ్యమై ముద్రణ భాగ్యమునంది ఆంధ్ర పాఠక మహాశయుల హస్తము లలంకరించు చున్నది, ఈమార్గము చూపినవారు ప్రోత్సహించినవారు, సాయపడినవారు సహృదయ-విద్వజ్జన తిలక—కరుణామయి శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ

గారు. ఆంధ్ర సాహిత్య అకాడమీ స్త్రీల విభాగమునుండి ముద్ర ణకుఁ గొంత సాయముఁజేసి నా కృతజ్ఞతకు పాత్రురాలై అకాడమీ యశస్సునకు కారణమైనది. అందుకు శ్రీమతి లక్ష్మీకాంతమ్మ గారి కిని ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ కార్యవర్గమునకును ధన్య వాదము లర్పించుచున్నాను.

నా రచనలో గుణము లున్నవో లేవోకాని దోషములుండుట సహజము. యీ పుస్తకము నాదరించి, సహజవాత్సల్యమునఁ బరిశుద్ధముచేసి యిచ్చిన మహామహులు మద్గురు తుల్యులు బ్రహ్మశ్రీ గడియారము వేంకటశేషశాస్త్రిగారికి నమస్కారము దక్క నేనేమి చేయఁగలను? ఈ కృతినేగాక నా యితర కృతులను గూడ సంస్కరించి వెలయించిన యుదారులువారు. వారికి దోయి లించుచున్నాను,

ఇది పీఠికగాక విజ్ఞాపనము మాత్రమే — చదువరులైన రసికులే దీనికిఁ బీఠిక వ్రాయఁగలరు—అందగించగలరు — ఆనందించగలరు. ఈ సంతోషముతో — దీనిని అందముగా ముద్రించి యిచ్చిన "ప్రకాశ్ ప్రెస్సు" వారికిఁ కృతజ్ఞతతో నీగ్రంథము నాంధ్రలోకమున కర్పించు చున్నాను

సరస కవయిత్రి,

**గంటి కృష్ణవేణమ్మ**



# శ్రీ గిరిజా కల్యాణము

శ్రీ నీహార గిరీంద్రకన్య సుమనస్సేవ్యాంఘ్రి నీరేజ శ్రీ
జ్ఞానాంబాయుతుడై నిజాశ్రితుల యజ్ఞానాంధ్యముం బాపి
పూర్ణానందంబున కాళహస్తి పురి నశ్రాంతంబుఁ గొల్పొందు నీ
శానుం డిష్ట ఫల ప్రదాయియయి నిచ్చల్ మమ్ము బాలించుతన్. 1

క॥ నవ్వులకై హరుడొక పరి
పువ్వుల రువ్వంగ నెవను బూనిన యలుకన్
మవ్వపు చనుబంతుల శివు
నొవ్వగఁ జేసిన భవాని నుతియింతు మదిన్. 2

గీ॥ కొండ రాచూలి ముద్దుల కొడుకుఁ గుజ్జు
అముటేనుగు తలగల సామి మొదటి
విప్రులకు నెల్ల నొజ్జయై వెలయు పెద్ద
బొజ్జగల ప్రోడ గొల్తునే ప్రొద్దు బత్తి. 3

క॥ కరములు మోడ్చి నుతించెదఁ
స్థిరభక్తిఁ విశేషపుణ్యు దీన శరణ్యున్
స్మర జిత్వర లావణ్యున్
సురజన సేనాగ్ర గణ్యు సుబ్రహ్మణ్యున్, 4

క॥ పంకజ లోచనుఁడ ఘనా
శంకరుఁ డమరేంద్ర వంద్య చరితుడు శ్రీ మ
ద్వేంకట రమణుడు మామక
సంకటములఁ బాపి సౌఖ్య జలధిఁ దేల్చుఁ. 5

గీ॥ నాల్గుమోముల వేద స్వనములు మ్రోయ
తెల్ల దామర గద్దెపై నుల్లసిలెడి
పలుకుల వెలంది మగడైన పద్మభవుడు
ఆయురారోగ్యములను మా కలరఁజేయు 6

క॥ బృందా వనమున గోకుల
బృందంబులఁగాచి కొనెడి పీతాంబరుఁడా
బృందారక జన వంద్యుఁడు
నందాత్మజుఁ డొసఁగు మా కనంత యశంబుల్. 7

సీ॥ పరిపూర్ణ నవసుధాకర బింబమును బోలు
ముఖమున ముంగురుల్ మొనసియాఁడ
కస్తూరి కుంకుమ కలితమౌ తిలకంబు
నిటల తటంబున నీటు గుల్క
మాణిక్య తాటంక మంజులారుణ దీప్తి
చెక్కు టద్దములతోఁ జెలిమి సేయ
మణి మాలికలలోని మంగళ సూత్రంబు
సౌభాగ్య విభవంబుఁ జాటుచుండ

గీ॥ మొనసి మొల మాలి గంటలు మ్రోయుచుండ
కనక మణిమయ కంకణ క్వణన మెసగ
గజ్జెలందెలు పదముల ఘల్లురనగఁ
వచ్చి మాయింట నుంటుతి లచ్చియెపుడు. 8

కం॥ వాణీ వీణా పుస్తక
పాణీ శుకవాణి మత్తభంభర వేణీ
యేణీ ద్రుక్కోణీ యజు
రాణీ వాక్చుద్ధి నొసగి రక్షింపునను౯, 9

కం॥ అంబా శ్రీ జ్ఞానాంబా
బింబాధర నీల చికుర పీన కుచతట
లంబోదర జనయిత్రీ
అంబా పలికింపు నన్ను నార్యనుతముగా 10

—: క వి స్తు తి :—

గీ॥ వ్యాస వల్మీక భవ కాళిదాస భాస
చోర భవ భూతి దండి మయూర బాణ
మాఘ శ్రీ హర్ష బిల్హణ మల్హణాది
సంస్కృత కవి వతంసుల సన్నుతింతు 11

ఉ॥ నన్నయబట్టుఁ దిక్కనను నాచనసోముని శంభదాసు పో
తన్నను సార్వభౌముని బుధస్తవనీయుని రామకృష్ణు సం
పన్నయ శీలుఁ బెద్దనను భాస్కరు సత్కవి సూరనార్యుని౯
మన్ననతోడ నాంధ్ర కవి మాన్యుల కంజలిఁజేసి మ్రొక్కెదఁ౯ 12

క॥ సరసుడు విమర్శ గాగ్రే
సరుడును సత్కవియు, కుప్పుస్వామ్యార్యుడు మ
ద్గురుడైన తాతగారికి
స్థిరభక్తిం బ్రణుతి శతము సేతు౯ మదిలో 13

క॥ సతికేడు గడయ పతియను
గతి నాకు మగండె విద్య గఱపిన గురుడౌ
సతతం బాతని పదముల
కతిభక్తి౯ మ్రొక్కి వంశమభివర్ణింతు౯ 14

—: కు క వి ని రా క ర ణ, :—

కం॥ నోటికి తాళము లేదని
మాటలు వేయూతరాదు మాన్యుల కడనే
పాటింపని తెలిపి యావల
సూటిగ వేలెత్తి తప్పు జూపగ వలయున్ 15

వ॥ అని యిష్టదేవతా ప్రార్థనంబును సుకవి బహూకరణంబును రణంబును కుకవి నిరాకరణంబును గావించి భక్తిరస బంధురం బగు నొక్క ప్రబంధంబు నిర్మించునెడఁ సంప్రదాయాను సారంబుగా మదీయ వంశావతారంబభి వర్ణించెద. 16

—: వం శా వ తా ర వ ర్ణ న. :—

సీ॥ తనయ శశ్చంద్రికా తతులు ద్రావిడ వంశ
కలశ పాథోధికి తెలివి సేయఁ
దనమహా పాండిత్య దాతృత్వ కరిమంబు
శిష్యుల కొంగు పసిండిగాగ
తన పూర్ణవిజ్ఞాన ఘనత నిత్యము
రాజ రాజి పూజలకు పాత్రంబుగాక
తన పవిత్రాచార మనయంబు భూదేవ
జనుల కాచరణీయమును వచింప

గీ॥ నిఖిల బుధజన సేవ్యుడై నెగడు చుండు
నవని కలియుగ వైకుంఠ మనగ బఱఁగు
తిరుపతి పురంబు నందును ద్వేలఫణితి
మన్ననల నొందు కాశయ్య మాన్యయశుడు 17

గీ॥ సద్గుణంబుల పోవని జనులు వొగడ
నన్ని విధములఁ గాశయ్య కనుగుణముగ
పూసలందలి దారంబు పోల్కి వెలసె
సాధ్వి లక్ష్మాంబ శివు కగజాతవోలె. 18

క॥ యతి యైనను రాజైనను
సుతుడుగ జన్మించు లబ్ధ సుకృతుల కను నా
గతి నాదంపతు లిరువుర
కతులిత యశుడైన రామయార్యుడు పుట్టెఁ 19

ఉ॥ ఆ మహనీయమూర్తి సుగుణాకరుడంచును వన్నెకెక్కె వి
ద్యా మహిమాంబు రాశికి సుధాంశుడటంచు మనీషివర్యులు
ద్దా మగతి న్వచింపగ సతంబు ప్రశస్త సమస్త వాఙ్మయ
స్తోమము లందశేష గుణధూర్వహుడై గడియించె పాండితిఁ 20

గీ॥ విద్య కొదవెను వినయంబు వినయమునకు
జక్కదన మబ్బె దానికిఁ జవ్వనంబు
యౌవనమునకు భూషణ మయ్యెశీల
మన్నిటికి మేలి సిరులు రామయ్య కలరె. 21

సీ॥ పఠియించె నెవ్వాడు ప్రస్థానములు మూఁడు
చిఱుత కూకటినాడె చెన్నుమీర
చరియించె నెవ్వాడు సద్ధర్మ పత్నితో
దాక్షిణ్యమున గృహధర్మ నిరతి
నొప్పారె నేవిభుం డుద్యోగియై యాంధ్ర
దేశాన, బౌరుష దీప్తి వెలగ
సన్యసించె నెవండు సకల భోగంబుల
ముక్తి కాంతాసక్తి మోకరింప

గీ॥ బ్రహ్మ నిష్ఠా గరిష్ఠుడై పరమశాంత
చిత్త యుతుడయి పార్వతీ చిత్తచోరు
పూజ సల్పుచు నుండునే పుణ్యమూర్తి
యతడు రామయ్య లోక విశ్రుత యశుండు. 22

కం॥ అరి షడ్వర్గము లాతని
పరిసరముల కేగ వెఱచి పరుగిడు నెప్పుడే
తరినైన బోయ నేనిఁ
సరసత నాతనికి భక్తి సలుపుచు మెలగుఁ. 23

ఉ॥ కామము ముక్తికాంత బిగికౌగిలి గోరుటయందు, క్రోధముఁ
వేమరు తన్ను జుట్టుకొను వేవిషయాదులయందు, లోభమా
తామస మింతలేక నిరతంబును గూర్చిన పుణ్యరాసులం
దామహనీయు నెన్న దరమాయని లోకము సన్నుతించెదఁ 24

గీ॥ తండ్రి కీర్తికి సుంతేని దఱిగి పోక
రామ యార్యుండు విభవాభి రాముడనుచు
లలిత గుణసాంద్రయగు సుబ్బలక్షుమాంబ
బరిణయం బయ్యెఁ బాంధవుల్ బ్రస్తుతింప. 25

కం॥ విసువడు వేసట నొందదు
కసరదు యాచకుల, నెంతొ కరుణను దైవం
బొసగిన యది యిడుచుండును
పొసగఁ లక్ష్మాంబ యన్నపూర్ణ యనంగఁ. 26

కం॥ నిరతము లలితాంబాపద
సరసీజ ధ్యాననిరత సంతత రస వ
త్తర పద్య గద్య కవితా
కరణైక ధురీణ యగుచు గణుతిం గాంచుఁ. 27

కం॥ ఆరామయ లక్ష్మాంబల
గారాబు తనూజనై యకల్మష చిత్తుఁ
మారా కారు నుదారు సు
ధీరాగ్రణిఁ బెండ్లియైతిఁ దిరముగ జగతిఁ. 28

గీ॥ సతత వేద విద్యత్కృత సవన హోమ
ధూమ సంచ్ఛన్న రవి సుధాధామ మండ
లంబు వేద విద్యార్థి జాలముల కల్ప
వల్లి నాదగు యఱగుంట్లపల్లి దనరు, 29

ఉ॥ అందు నిరంతరాశ్రిత జనామర భూరుహ శాఖినాగ జె
న్నొందును ద్రావిడాన్వయ పయోనిధి పూర్ణ సుధాకరుండు స
ద్వందితు డన్నదాత గుణవంతుడు శాంతుడు, గర్వహీనుడె
ప్పుందగు కీర్తిశాలియు ననారత సత్యవచో ధురీణుడున్. 30

గీ॥ దనరు గంటి సుబ్రహ్మణ్యమనగ నతడు
కలిమి బాంధవమ్మున గుణ గుణములందు
వన్నె కెక్కిన యజ్వలౌ వారిబిడ్డ
ఆది లక్ష్మాంబను ద్వహమయ్యె వేడ్క. 31

కం॥ ఆడను పతిమాటకు బదు
లాడదు పరుషోక్తు లెవరి నాడద నృతమున్
వీడదు పతి నంసేవన
పాడి దొరగిసేయ దెట్టిపని కలనైనన్. 32

క॥ వారల జేష్టుడు విద్యా
పారంగతు డాంగ్ల పట్టభద్రుడు సదయుం
దారయ వేంకట సుబ్బయ
కోరి నన్ను పెండ్లియాడె గురుఁడై వరుఁడై॥ 33

చ॥ ఎఱుగడు దుష్కృతంబులను నీశ్వరు పాదసరోజ యుగ్మమున్
మఱువడు శాస్త్రచోదిత సముంచిత మార్గ విహార పద్ధతిన్
దఱుగడు బంధుమిత్ర సముదాయ సమాదరణైక శీలతన్
వఱలు మదీయభర్త గుణవంతుడు వేంకట సుబ్బయాఖ్యుడై 34

క॥ పరిహాసంబుల కైనను
పరకాంతల పేరులెత్తి బలుకడు నాతో
బరుషోక్తులాడి యెరుగడు
పరమ దయామూర్తి నాదు భర్త యనదగున్ 35

క॥ ఇరువది వర్షము లీగతి
శరవేగములోన గడప జాలితి నంతన్
బరతెంచె దుర్దినమ్ములు
మరుగయ్యెను కుంకుమంబు మాంగల్యంబున్ 36

క॥ తొలిచూలు లలిత యనగను
మలి దత్తాత్రేయు డనగ మాకొదవ విరియా
ఫలముల గాంచుచు పతినెద
దలచుచు జ్ఞానాంబ భక్తి తలఁగక నుంటన్ 37

—: షష్ట్యంతములు. :—

క॥ శ్రీ జ్ఞానాంబా ధవునకుఁ
అజ్ఞానతమః పతంగుడగు నీశునకున్
ప్రజ్ఞా ప్రతిష్ఠి తాత్మకు
సుజ్ఞాన విచక్షణునకు సోమ ధరునకున్ 38

క॥ ఉత్సాధి పవాహనునకు
దక్ష మఖధ్వంసకునకు ధనద సఖునకున్
దక్షిణ కాశీ వాసున
కక్షీణ కృపార్ద్ర నీక్షణా పాంగునకున్ 39

క॥ విషధరునకు విషగళునకు
విషధర కుండలు నకు శ్రుతి వేద్యునకును నా
విషమాంబక సంహరునకు
విషమాంబకునకు సమస్త విషయఘ్నునకున్ 40

క॥ హరునకు గౌరీ మానస
హరునకు కందర్ప దర్ప హరునకు భవసం
హరునకు శివునకు శశి సుం
దరునకు గాంభీర్య జిత కనక కుధరునకున్ 41

క॥ దోషా కరార్ధ ధరునకు
దోషాకర గర్వహనన దోర్వీర్యునకున్
భూషాయిత శేషాహికి
భాషాధిప వినుత దివ్యపద యుగళునకున్ 42

క॥ బాలేందు శేఖరునకు త్రి
శూలాయుధ హస్తునకు విశుద్ధ యశునకున్
లీలా కురంగ ధరునకు
హాలా హల హరికి కాళహస్తీశునకున్ 43

వ॥ అంకితంబుగా నా యొనర్పంబూనిన
గిరిజా కల్యాణంబను భక్తిరస బంధురంబగు ప్రబంధ
మునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 44

గీ॥ నిఖిల నృత్తేతి హాస నిర్ణేతయైన
సూతుఁ బొడగాంచి హిమశైల సుతమహేశు
నే విధంబున జేపట్టె నెఱుగఁ జెప్పు
డనుచు మునులెల్ల భక్తితో నడుగుటయును 45

క॥ అనవద్య చరితు డివ్విధి
మునులకు వాక్రువ్య దొడిగె ముద మొదవంగన్
వినుడీ గిరిజా పరిణయ
మును దెల్పెద నదియె భుక్తి ముక్తి ప్రదమౌ 46

క॥ నిరతము శంకరు చరిత్రము
లెరిగించిన విన్నవారి యెడఁ జేరునె యే
తరినైనఁ బాతకంబులు
చిరభాగ్యము లిచ్చు మౌని శేఖరులారా 47

క॥ శివు కథలను వినువారికి
శివ కరమగుఁ బాయదెపుడు సిరివారికడఁ
శివ సాయుజ్యము బొందుదు
రవలను జన్మంబువారి నంటదు జుండీ. 48

క॥ భవసాగర మీరఁగ నా
భవు చరణాంబుజమె నావ పరికింపగ నీ
భువి నజ్ఞానాంధ్యమునకు
సవిత యతఁడె శశిధరుండు సంయములారా 49

క॥ మునునా మృకండు తనయుం
డను పమ శివభక్తుఁడగుచు నలరెడి కతనఁ
మనియెను చిరాయు రున్నతి
గనె సృష్టి స్థితి లయాదికములన్ ముక్తిన్ 50

ఆ॥ వె॥ ఈశు పాదభక్తి లేశమే మానవు
మది జనించువాఁడ మర్త్యలోక
మునను సౌఖ్యమందు మునులార దూదిపై
నగ్ని దవిలినట్టు లరిగి భవము 51

—: హి మ వ ద్వ ర్ణ న :—

సీ॥ చంద్రశేఖరున కాశ్రయ మొసంగినవాడు
నిఖిలౌష ధీశుడై నెగడువాఁడు
అప్స రోంగనలకు నాట పట్టగువాఁడు
గంగాభవానిని గన్నవాఁడు

కామధేనువునకు గ్రాస మిచ్చెడివాఁడు
నిధుల కాకరమౌచు నెగడువాఁడు
సన్మునీంద్రులఁ గ్రూర సత్వంబులను నొక్క
కరణి యేవేళల గాచువాఁడు

గీ॥ జలదముల శ్రమ బాపంగ దలచువాఁడు
పరమ శీతల హృదయుడై బరగువాఁడు
ధీరుడాతని సరి భువి తేరనంగ
దనరు హిమవంతుడన పర్వత ప్రభుండు 52

ఉ॥ పెల్లుగ భూదారాగ్రమున భీకర కానన సీమ శాంబరీ
భిల్లుల బోలు భిల్లులతి భీషణ గంధ గజేంద్ర కుంభమున్
గుల్లలుసేయ ముత్యములు కోరక పంక్తులువోలె రాలి రం
జిల్లు హిమాద్రి భర్తకు విచిత్రపు భూషల నిద్దకైవడిన్ 53

ఉ॥ కీర దకంబ కంబులును కేకి సమూహము లెల్లవేల శృం
గారముగాగ బాడుచును గౌశల మొప్పగ నాడుచుండు నా
ధీరుని కీర్తి గీతముల తీరున దెల్పుచు నాడు నోయనన్
వారక గాంత్రు రెప్పలను వాల్పక వేల్పులు రిచ్చపాటునన్ 54

గీ॥ పడత్తి భూదేవి గప్పిన పచ్చడంబొ
కాక హిమవంతు వీటి ప్రాంగనమునందు
జెలగు మణివేదికలొాయంచు చింతసేతు
రచటి పచ్చికబీళ్ళ వియచ్చరాళి 55

అందు మృగరాజు గర్జన లద్రిరాజు
శౌర్య ధైర్యాదులందెల్పు చాడ్పుదోచు
నలరు నవనిధు లతని యౌదార్య గుణము
లుగ్గడించెడి తెన్నున నొప్పుచుండు 56

గీ॥ మేఘమాలికలను గాంచి మేనులుబ్బ
నాట్యమాడెడి కేకి విన్యాస కలన
చామరలు వైచు నోయన చాలుచుండు
ఫణి ఫణాగ్రంబులను దివ్యమణుల దీప్తి
యతని గృహదీపి కలయట్టు లలరుచుండు 57

క॥ పితురుల మానస పుత్రికఁ
నతులిత సౌందర్య ధుర్యయగు మేనకయన్
సతిఁ గులపత్నిగ జేకొనె
కుతుకంబున నద్రిరాజు కులము వెలయగన్ 58

వ॥ ఇటువలె నక్కొటి లాలకఁ జెట్టఁ బట్టి యమందా
నందంబు డెందంబునఁ గ్రందుకొన సమ్మృద్ధియంగూడి 59

క॥ మలయా నిలములు వీచగ
కల కల మను ద్విజకులంబు కలరవములు వీ
నుల విందు సేయుచుండగ
లలనయు గిరిరాజు క్రీడ లన్దేవి రోగిన్ 60

సీ॥ పల్లవంబు లటంచు భ్రమసి గిల్లగబోవు
లేమ కెంగేలంచు లీలబట్టు
పద్మంబు లాయన్న భ్రాంతి డాయగబోవు
చరణాబ్జము లటంచు సంతసించు
చిలుక పల్కులటంచు చెవియొగ్గి వినబోవు
చెలిపల్కౌనని చూచి సిగ్గుజెందు
జక్కవ కవలంచు సరవి పట్టగ బోవు
కొమ్మ పాలిండ్లని కుతుకమందు

గీ॥ ప్రాణపదమైన తన ధర్మపత్నిఁగూడి
వివిధ గతులను విహరించె వేడ్కమెఱయ
చూతపున్నాగ గంధ ఫలీతమాల
క్రముక జంబీర మాతు లుంగముల గముల  61

సీ॥ ఒకనాడు క్రీడించు నుత్సాహ మెదబొంగ
చెంగల్వ కొలకుల చెంతకరిగి
యొకనాడు నెలరేయి యువిదతో విహరించు
కనక భూధర దివ్య కటక తటుల
నొకనాఁడు జలకేళి కుద్యుక్తుడై పిల్చు
సతి కీత గఱపెడి సంభ్రమమున
ఒకనాఁడు చదరంగ మొప్పారగా నాఁడు
బన్నంబుగా దన పదవి నొడ్డి

గీ॥ శీత భూధర ఘన సర స్తీర లసిత
లలిత పుష్పలతా డోలికల సతంబు
సరస సల్లాప లాలనా సంభ్రమముల
దినము క్షణముగ గడిపె నద్రి ప్రభుండు  62

ఉ॥ ఆ తరుణీ మణిన్ గలసి యంతకుఁ నంతకు ప్రేమమీరగా
నాతత సౌఖ్య సంపదల నందుచునుండె మనోజ లీలలన్
నాతరి మేన కాత్మజు ననంతరమున్ భవు కోర్కె దీర్పగాఁ
బూత చరిత్ర బక్ష సుత పొల్పుగ జొచ్చెతదీయ గర్భమున్ 63

కం॥ నెల మసలె నెలత కప్పుడు
పలుచనయ్యే దేహమెల్ల బడలిక దోచెన్
చెలులతోఁ బలుకుట మానెను
తలపునఁ గోరికలు పెక్కు దవులం జొచ్చెన్  64

ఉ॥ పుల్లని నిమ్మపండ్లు దినబుద్ధి దలంచు మరెవ్వరేని ద
న్నుల్ల సమాఁడఁ జూతురని యూరక మూర్కొని పారవైచునే
పల్లవ పాణులైన పసిపాపను గందు వటన్న సిగ్గుచే
నుల్లము పల్లవింపని కయూరక యుండుడటంచు నవ్వెడిన్ 65

క॥ వెన్నెలలో భుజియింపఁగ
నన్నెలతకు వేడ్క వొడమె నపుడు చెలులా
సన్నదెలసి సఖియులతో
వెన్నెలఁ భోజనము లిడిరి వేడ్క సెలంగన్ 66

సీ॥ ఏ పదార్థముగన్న వెగటుగా గన్పట్టె
తోడి వారితొ ముచ్చటాడ దయ్యె
నెలత సన్నునిగాను సింతు కొనఁగ సాగె
గురుత జంఘల లోన గుదురు కొనియె
చూచుకంబులు వెల్గె మేచక ప్రభలతోఁ
దెలివి చెక్కిళ్ళపై నలము కొనియె
కనుదోయి నొక వింతకాంతి విడంబించె
నంతకంతకు మార్పు లతిశయిల్లె

గీ॥ నమర వరులెల్ల సంతస మందుచుండ
పర్వతేంద్రుని తపములు పండనట్లు
సర్వమంగళ యుదయించు చాడ్పు దెలియ
నెలత కప్పుడు తొమ్మిది నెలలు నిండె 67

చ॥ శివకథలాల పింపమది చింతనసేయు మహేశు పాదసం
స్తవన మొనర్చు సూనముల చంద్రకళాధరు బూజసేయగా
దివురు భుజంగ భూషణు నుతింపుచు గీతి కలాల పించునా
భవుప్రియురాలుగర్భమునభాసిలుచుండనగేంద్రునిండిఁయుఁన్68

క॥ మణిమయ సరములఁ దాల్పక
ఘనమగు రుద్రాక్ష సరులఁ గౌతుక మొప్పన్
దనకంబు గళము నందిడ
మనమున నుత్సాహమొందు మానిని యెపుడున్ 69

శా॥ కైలాసా చలమంచు నెంచు కృతక గ్రావంబులం గాంచినన్
శూలంబంచు భ్రమించి చేకొనగ నెంచున్ కోలలంజూచినన్
లోలత్వంబున చంద్రశేఖరుని నాలోకించు లోలోపలన్
శైలాధీశుని రాణి గర్భమున నోజన్ గౌరి రంజిల్లగన్ 70

వ॥ ఇట్టులాగట్టు లయకిమీని పట్టమహిషి దుర్భరంబగు
గర్భ భారంబున నుండె 71

గీ॥ ఒక్క శుభదినమున నిక చోత్పలాక్షి
గనియె సుకుమార సుందరా కారయైన
దుహితఁ సౌభాగ్య లక్షణా సహిత మహిత
దురిత విరహిత విశ్రుత సుందర చరిత్ర 72

మ॥ సురలోకంబున దూర్యరావముల కచ్చుల్ హెచ్చుగా మ్రోసెన
చ్చర పూబోణులు నాట్యమాడిరి మహాసంతోష మందంగ సా
గిరి మౌనీశులు పాడిరీశ్వరునిపై గీతాళి గంధర్వుల
త్తరి దాక్షాయణి శైలరాజ దుహితృత్వంబొంది జన్మించుటన్ 73

వ॥ అత్తరి నొక బిత్తరి

ఉ॥ వేణి నటింప వెన్నుపయి వేమరుపయ్యెద చక్కఁ జేర్చుచున్
మాణవకంబు పేర్లను సమంబుగ దిద్దుచు మాటిమాటికిన్
ఆనన సీమ గప్పికొని యల్లన చిందులు ద్రొక్కు ముంగురుల్
పూనికఁగేల ద్రోయుచును పోయెనొ కర్తుగిరీంద్రు పాలికిన్ 74

ఉ॥ పోయి నమస్కరించి హిమభూధర రాజవరేణ్యు స్వస్తిదే
వా యశధారు దేవి పసిపాపను గాంచిరి లీల నాప్ర సూ
నాయుధ బాణమోయనగ నంబుధి కన్యకవోలె నిత్యసు
శ్రీయుత భాగ్యలక్షణ విశేష గుణాన్విత నంచు దెల్పినన్ 75

క॥ వినినంత నెదన మనమున
ఘన కౌతుక మంది యతఁడు గారవ మెదగీ
ల్కొనగ నమూల్యపు హారము
లను కానుక గాగ నొసఁగి లలనను బనిపెన్ 76

గీ॥ వివిధ దానంబుల నొసంగి విప్రవరుల
దనివి నొందించి గిరిరాజు దనియు చుండె
వంశవర్ధనియై గౌరవంబు దెచ్చు
దుహితగల తండ్రి నిత్యసంతోషిగాడె 77

క॥ ఆటల పాటల నెదలో
నాటిని ప్రేమమున లాలనం బొనరి చిదా
యేటను బెంచెడి బిడ్డను
పూటన్ బెనిచిరి నగాధి పునియింటి సతుల్ 78

గీ॥ సప్త ఋషులను రావించి జాతకర్మ
నామకరణాది విధుల నానంద మొప్ప
జేసె నద్రీశు డంతనా శిశువునకును
బంధు జనములగూడి వైభవ మెలర్ప 79

క॥ పార్వతియను పేరిడిరా
పార్వణ చంద్రాస్యయై విభాసిలు సుతకున్
శర్వున కిల్లాలగుటకై
శర్వాణి యనంగ బరగె సంయములారా 80

వ॥ పెక్కు నామంబు లక్కన్య కెవ్విధంబునం గలిగె నానతీ
యవే యని మునినాథులడుగ వినుమని యవ్వి
తరణ ఖని యిట్లనియె. 81

క॥ పలువిధముల నామేనక
వలదని తపమునకు బోవ వారింపఁగ నా
జలజాక్షి యుమయ టంచును
బిలువం బడె జనులచేత ప్రేమవలిర్వు 82

గీ॥ కత్యయను గోత్రమున బుట్టుకారణమున
బరగె కాత్యాయని యటంచు బద్మనేత్ర
గౌర వర్ణపు కాంతిచే గ్రాలుకతన
దనరె గౌరీ యనెడిపేర ధన్యులారా 83

క॥ సురరత్నపు దీధితులన
నరుదారెడి మేనికాంతి యలరుట చేనా
తరుణీ మణి కాళీయన
బరగెన్ జనవిదితమగుచు పావనులారా 84

గీ॥ కలికి హిమవంతు సుతయైన కారణమున
హైమవతియను నాహ్వయంబయ్యె సతికి
ఈశ్వరార్ధాంగి యగుటచే నిందువదన
అలరె జగతిలోను నీశ్వరి యనెడిపేర 85

క॥ శివసతి యగుటను శివయని
భువిలోనఁ బ్రసిద్ధిగాంచె పూతచరితయా
భవునిల్లాలై దనురుట
భవానియను పేర నెప్పు డొప్పుచు నుండెన్ 86

క॥ రుద్రున కిల్లాలయి యా
భద్రేభ సమాన యాన బరగెడు కతనన్
రుద్రాణి యనెడి నామము
భద్రంబై వెలయుచుండు పావనులారా 87

గీ॥ మంగళాలయ యగుటనా మానిని కిని
సర్వమంగళ యనుపేరు జగతివెలిగె
పర్వతేంద్రుని బిడ్డయై భాసిలంగ
పార్వతీ యనంగ నామమా బాలకలరె 88

గీ॥ దుర్గముల వసియింప నాతోయజాక్షి
బరగె దుర్గయన పేరున భవ్యులార
ధరణి మృడునకు సతియైన దానఁజేసి
తరుణికి మృడాని యను నభిదాన మయ్యె 89

గీ॥ తుహిన భూధర రాజేంద్రు దుహితయగుట
వెలసె గిరిజాభి ధానమా నెలత కపుడు
మేనకాత్మజ యగుటచే మీననేత్ర
మేనకాత్మజయని కూర్మి మెలగుచుండు 90

క॥ ఆ కలముల దిని హరుపై
నేకాగ్రత మనసు నిలిపి యింతి దపము దా
సాకల్యంబుగఁ జేయుట
చే కలిగె యపర్ణయనెడి చిరునామంబున్ 91

వ॥ నిట్టి చిట్టిపాపను గట్టుదొర పట్టమహిషి
చుట్టంబులు

గీ॥ గాజు లొరయంగ కంకణ క్వణన మెసగ
కచభరమునుండి విరిసరుల్ గదలిరాల
బాలికను తొట్లయందుంచి జోలవాడె
నారి యొక్కతె నీలాంబరీ రవమున 92

చ॥ కులుకుకుచంబులుంగదుల కుందములంహసియుంచుదంతకాం
తులకు నకాల చంద్రికలు దోపఁగ పల్కుల తేనెలొల్కగా
బలుకుచు ముద్దులొల్కు పసిపాపను లాలని బాడి యూచెనా
కులుకుమితారి యోర్తుయలగోయలయోయన పంచమంబునన్93

ఆ॥ వె॥ బూచి వాడు వచ్చు పోరు పెట్టకు మమ్మ
యనుచు నొక్కచెడె యతి ముదమున
చిచ్చి హాయియనుచు చెరితట్టుచు నూచె
పాప యనుచు నెంత భాగ్యమెనొ 94

క॥ బొరుగిల బడుటకు నేర్చెను
తరుణుల పేరెత్తి బిల్చుతరి చూడ్కులనా
తరి బరపి నవ్వసాగెను
మురియుచు చనుగుడుపుతల్లి ముద్దులు గులుకన్. 95

క॥ అత్తత్త యనుట నేర్చెను
యెత్తరి నెవరైన బిలిచిరేని కనుగొనున్
పుత్తడి బొమ్మల గైకొని
బిత్తరు లాడింప కేక వెట్టుచున్ నవ్వున్ 96

ఉ॥ ఏమిటఁ బూజసేసె నొకొ ఈశ్వరుపాద సరోరు హంబులన్
శ్రీ మహిమాస్పదంబు భవు చింతనమే క్రియఁజేసి కాంచెనో
ఈమహితాద్రిరాజ చపలేక్షణ ముజ్జగ మేలజాలు నీ
కోమలి పాప యంచుమది కోర్కులుదీరగ నెత్తి పెంచెడిన్, 97

ఉ॥ అపసిబిడ్డ నెత్తికొని యంబుజ లోచన యుగ్గుబోసి యీ
పాపను గావుడంచు దివి భక్తుల కెల్ల నమస్కరింపగాఁ
నూపుచు జోల బాడుచును నల్లము రంజిల ముద్దుసేయగా
బాపురె యెంతపుణ్యమని బల్కుచునుందురు తోడికామినుల్ 98

ఉ॥ ఈగతిఁ నేడు లోకముల యేనడిపించెదనన్న రీతిగాఁ
నాగమ మూలమైన పదమల్లన మోపగజాలె భూమిపై
భోగియు భూమిదేవియును భూధరముల్ గడు భారమందగా
సాగిరి పర్వతేంద్రుసుత చారు తరంబగు పాదమెట్టిదో. 99

క॥ జననియుఁ గడు గారాబం
బున బెనుపగ శుక్లపక్షమున శశికరణిన్
దిన దిన మునకునూ పార్వతి
యను వొప్పగ వర్ధమానయయి విలసిల్లెన్ 100

సీ॥ క్రీడించు నొకవేళ కృతకాద్రి కైలాస
పర్వతంబేను శ్రీ భర్గుడనుచు
పొలుపొంద నొకవేళ బొమ్మ పెండ్లి యొనర్చు
నెయ్యుర తోడను వియ్యమందు
పెట్టించు చెలులకు పెండ్లి భోజనమని
గుజ్జన గూళ్ళను కోర్కె తోడ
తీవల నొకపరి మావికొమ్మల గట్టి
గేయుచు డోలికా కేళి సలుపు

గీ॥ తరుణులకు జెప్పు నీలకంధరుని కధలు
శివునిపై గీతముల నేర్పు చిలుకలకును
గఱపు రాయంచగములకు గమన విధులు
విరి సరంబుల గూర్చెడి వివిధగతుల. 101

వ॥ యిత్తెరంగున నాపుత్తడి బొమ్మ చిత్తంబు లిగురొత్త
నను దిన ప్రవర్థమానయై విలసిల్లు చుండెననిన
నవ్వలి కథావిధానం బానతీయ్యా వేయని యడుగుటయును 102

చ॥ ధరణి శతాంగ మత్త గజదైత్య మహోజ్వల గర్వభంగ సుం
దర తర నిర్మలాంగ నతదైవత మౌని మనోజ్ఞ భృంగ వి
స్తర కరుణాంత రంగ ప్రియతత్వర శైల సుతానుషంగ శ్రీ
వరనుత కాళహస్తిపుర వాయువలింగ భుజంగ మాంగదా 103

మాలినీ కనక కుధర చాపా ఖండితాగి ప్రతాపా
జనవినుత చరిత్రా శైలకన్యా కళత్రా
త్రినగర భలభంగా దివ్య గంగోత్తమాంగా
ఘన నటన విలాసా కాళహస్తీ నివాసా 104

శ్రీ శ్రీ శ్రీ

గద్య ఇతి శ్రీ కాళహస్తిజ్ఞాన ప్రసూనాంబికా వరప్రసాధ సమా
సాదిత కవితా వైభవ శ్రీ కళ్లూ రామశర్మార్యతనయ
నితాంతనయ వాధూల గోత్ర పవిత్ర సుజన విధేయ
సరస కవయిత్రీ గంటి కృష్ణవేణీ నామధేయ ప్రణీతంబైన
గిరిజా కల్యాణంబునందు ప్రథమశ్వాసము
సంపూర్ణము.



శ్రీ

# శ్రీ గిరిజా కల్యాణము

## ద్వితీయాశ్వాసము,

క॥ శ్రీ మహనీయ గుణోజ్వల
హైమవతీ కుచని గూహ నామోదిత హృ
త్సీమా ప్రమథాదిప స
ర్వామర నుత కాళహస్తి నాయకలింగా 1

వ॥ అవధరింపుము మహనీయ గుణ గరిష్టులగు న
మ్మునిశ్రేష్టులకు నిఖిలగాథా నిర్ణేతయగు సూతుఁ
డిట్లని చెప్పం దొడంగె. 2

క॥ పెట్టని భూషలనగనా
గట్టుల యెకిమీని తనయ కడు సొంపెసగెన్
నెట్టిన యవ్వనమున గన్
న్పట్టెన్ హరుగెల్చు కాము బాణంబనగన్ 3

క॥ ఘోరుని మాయ వెలుంగున
సారెకు బలుసాన దీర్చి ఝుళిపించెడి యా
మారు కఠారి యనంగను
ధారాధర తనయ యొప్పె తారుణ్యమునన్. 4

క॥ సారసములు సఖి పదములు
కోరకములు కుచయుగంబు కోమలి కనులున్
నీరజములనగ జెల్లు న
యారే పొగడంగవశమె యజునకు నైనన్. 5

చ॥ హరిప్రియ పాదపద్మముల నంటి భజించియు రిత్తపోవుచున్
హరిప్రియ సూనుపాదముల నర్ధి క్రియంబడిగొల్చి దీనయై
హరికరమంటి వేడికొని యానళినాక్షి పదారవిందమై
సురవర సన్నుతంబగుచు సొంపలరారెడి పంకజాతముల్ 6

క॥ చుక్కలు సరియన జెల్లునె
యక్కోమ లిపిత నఖాళి కనయము మింటన్
నొక్కొక్కప్పుడు మెఱయుచు
నొక్కొక్క పరికాంతి ధరిగి యుండెడివానిన్ 7

గీ॥ లలన జంఘల ఆజేయగాఁ నలువ యెంత
నేర్చెనోగాని నైపుణి నెల్లఁజూపె
సాటి బోల్పంగ లేమ ముజ్జగములందు
సాగరమునకు సాటియా సాగరంబె 8

క॥ కరి తుండంబులు కదళీ
తరువులు సరిరావుకాంతి దనరారెడి యా
తరుణీ మణి యూరువులకు
సరిపోల్చగ ధగదు కర్కశములగు నానిన్ 9

చ॥ అనయము చంద్రశేఖరుని యంకము నన్విసియించు భాగ్యమున్
గనిన ధరాధరేశ్వరుని గాదిలి పట్టని తంబసీమనే
యనువున సైకతస్థలి యటంచును జెప్పగవచ్చు నమ్మ హా
జనని శుభాంగ్గ కమ్ములకు సామ్యము లిట్టివి జెల్లివచ్చునే 10

గీ॥ అతుల కల్యాణ వారాశియందు బొదలు
చుండెడి తరంగములు నాగ సొంపుమీరు
కమలనేత్ర కుత్రివళులు గానుపించె
యతివ శృంగార వారాశి యనగ నొప్పె. 11

గీ॥ పొలతి యొడ్డాణమందున పొదిగియున్న
ఇంద్ర నీలము భాతినా యెసగునాభి
అతుల శృంగార రస ప్రవాహంబురీతి
నలరు నూగారు మారుని యల్లెయనగ. 12

క॥ గిరి సుతయని తెలుపకయే
యెరుగ గనగు కుచయుగంబులిందు వదనకుఁ
ధరలో తండ్రిని బోలిన
తరుణులె కడు ధన్యలౌట తథ్యంబనగఁ. 13

గీ॥ శంకరుని గట్టి వైవంగజాలు చాన
బాహులతి కలనేమాడ్కి వనమునందు
దీక్ష తపముల నొనరించి తెల్లబారు
బిసరుహంబుల కెనయనఁ బొసగదెపుడు. 14

క॥ మునిగణ మునకును నిర్జర
జనులకు చేఁజిక్కనట్టి శర్వుని చేప
ట్టిన యాగిరిసుత కరముల
ననవచ్చునె పల్లవంబులని సామ్యముగఁ. 15

క॥ కాదు ప్రవాళము సరియై
రాదుగదా దొండపండు రారాపులకుఁ
బోదెపుడు చిలుక లరయగ
మోదుగ లననెంత గెల్వ ముదితయ ధరమున్. 16

గీ॥ పల్లవంబుల మాటున నుల్లసిల్లు
కుంద బృందంబు లనజెల్లు నిందువదన
యధర పల్లవ మందున నలరుచున్న
శిఖరి దశనంబులెంతయు చెలువుగులుకు. 17

క॥ ఇందువదన నెమ్మొగముల
చందురుడని బలుకనెట్లు జాలు నతనిలో
కందువ మాసిననే గద
కుందర దగమోము కెనగ గూర్పఁగ వచ్చున్ 18

ఉ॥ చెక్కులు చంద్రఖండములు చెల్వగు కన్నులుగండుమీనముల్
జక్కవజంట చన్నుగవ చంపకపుష్పము నాసబింబమా
చక్కెరబొమ్మ మోవి వికచాబ్జము మోము మరంద బిందువుల్
చొక్కపు వాక్కులమ్మ గుదసోయగ మెన్నదరంబె యేరికిన్19

క॥ చమరీ మృగ వాలంబుల
భ్రమ చమరి మయూర బర్హమ్ముల పో
డిమిగొని సుందరి కురులను
కమలాసనుఁ డొనరఁజేసె గాఁబోలు జుమీ. 20

సీ॥ బర్హి పింఛమయంబు పడఁతి పెన్నెరివేణి
పూర్ణచంద్ర మయంబు పొలతిమోము
కుంద బృంద మయంబు కోమలి రదనముల్
మాటలు పీయూష మయము సువ్వె
కంబు మయంబౌను కల్యాణి కంఠంబు
గిరి మయంబగు పయోధర యుగంబు
మద మరాళ మయంబు మానిని యానంబు
వ్యోమ మయంబగు నువిదగౌను

గీ॥ హసిత మొప్పారు జోత్స్నా మయంబుగాఁగ
ఖంజరీట మయంబగు కన్నుదోయి
వెలయ శ్రీకార మయమౌచు వీనులలరు
పడతి సర్వాంగశోభ లావణ్యమయము. 21

సీ॥ కలికి పల్కులవోలె పలుకలేమని యెంచి
కీరముల్ వనముల జేరికొనియె
నెలతమై చాయతోఁ దులదూగగాలేక
విద్యుల్లతలు మేఘు వేడికొనియె
బోటినెన్నొ సతితో సాటి రానని యెంచి
చంద్రుఁడా శంకరు జటలడాగె
నాతి పెన్నెరుల కేరీతి బోలుదుమంచు
నళి కులంబులనంగు నండజేరె

గీ॥ అతివ కొనగోటి కీడు రామంచు దలచి
చుక్కలెల్లను మింటిపై స్రుక్కుచుండె.
లేమ నడకల కుద్దిగా లేమటంచు
సామజంబేగి దేవేంద్రు శరణుజొచ్చె. 22

గీ॥ మేఱుగులన్నియు నొడగూర్చి కరగబోసి
కమల గర్భుడు నీతను కాంతిజేసె
కాక వేరొండు విధమున గలుగుబెట్టు
లనుపమాన విలాసమీ యతివయందు. 23

చ॥ మిసమి వెలుంగు నంగజుని మేలగు పట్టపుదంతి యోయనన్
నసదృశ కేతకీకుసుమ విశ్రుత గర్భదళంబనంగ గ్రొం
బసిడి శలాకయోయనగ పర్వతపుత్రి మనోజ్ఞ గాత్రియై
యొసగుచునుండె జూపరుల కింపులనింపుచు జవ్వనంబునన్ 24

క॥ ఈరీతి తండ్రి యింటన
పారముదంబునను బెఱుగు పార్వతిఁ జూడన్
పారద సమసుశరీరుడు
నారదుడరుదెంచె నటకు నయవిదులారా. 25

క॥ సురమౌని వరుఁడు గాంచెన్
కరికిటి భల్లూకచమర ఖడ్గ గవయ, భీ
కర, శార్దూల, శరభముల,
కిరవై, యలరారుచుండు హిమవంతంబున్ 26

వ. చని యల్లిబిల్లిగ నల్లికొని యుల్లంబు పల్లవింప
జేయు సల్లలిత లతా, కుడుంగములును, చందన, మందా
ర, మంజిలు మకరంద మాలూరక్రముక ఖర్జూర
నింబ కదంబ గంబులను పనసబదరీ నారికేళాదిత
రులతా, వితానంబులును, చెన్నొందు, పురోద్యా
నంబు గడచి మణిగణ ఖచిత విరాజ మానంబగు
రాజ ప్రాసాదంబు ప్రవేశించి కక్ష్యాంతరంబుల
కడచి యభ్యంతరంబు పొచ్చి సతీసుత సమే
తుండై యున్న హిమవంతుఁ గనుంగొనె నయ్యవ
సరంబున తుహినాద్రి డిగ్గన గద్దియండిగ్గి. 27

గీ॥ అర్ఘ్య పాద్యాదు లర్పించి యాసనమిడి
యుచితరీతిని బూజించియో మునీంద్ర
మీరలీయెడ కరుదెంచు కారణంబు
నానతిమ్మని హిమవంతు డడిగి మరియు. 28

ఉ॥ పావనమయ్యె మాగృహముపండె తపంబులు సన్మునీంధ్ర మీ
దీవన లందుటఁగలిగె దివ్యపదంబు విచిత్రమయ్యె మీ
రీవన భూములందిచటి కేమికతంబున నేగుదెంతురో
గావుఢు మాయెడంగలుగు కార్యము గైకొని సత్కృపామతిఁ 29

వ॥ అని పలుకు శీతాద్రి పలుకుల కలరి నారదుండు మంద
స్మిత సుందర వదనారవిందుండై. 30

ఉ॥ సేమమెనీకు నీసతికి సేమమె నీసుతభృత్యు లెల్లరున్
సేమముగాగ నుందురొకొ శీతనగాధిప నీమ భాగ్యమో
నేమని దెల్పగానగు మహేశుని యల్లునిగాగ గొందు వీ
భామిని ప్రేమచే గెలిచి భర్గుని యర్ధశరీర మేలెడిన్ 31

క॥ కలుగరు కవతు లొకప్పుడు
మెలఁగెడి శివపత్నియగుచు మీన నయన భూ
వలయము నేలెడి ననియును
పలికెను సురమౌని యచలపతితోఁ గూర్మిన్ 32

గీ॥ మౌనివర్యుఁడు వలికిన మాటలకును
హర్షపూరిత హృదయుడై యద్రిరాజు
బ్రహ్మ మానస పుత్రయో భవ్యచరిత
యెల్లమీదగు కరుణయే కల్లగాదు. 33

గీ॥ అనచు కరములు మోడ్చిన యచలపతికి
దీవన లొసంగి చనియెనా దేవమౌని
అదియు మొదలుగ నెదలోన గుదురులేక
చింతసేయుచు నుండెను శివునిగూర్చి. 34

క॥ శ్రీపతి వాణీశాదులు
నేపొద్దు భజింతురట్టి యీశ్వరు పదముల్
తా పరమార్థము గోరక
నాపట్టిని గొనుమటంచు నగపతి గొలిచెన్. 35

గీ॥ తరుణ దక్షాధ్వరమ్మున దగ్ధమైన
తప మొనర్చెడి నూర్ధ్వ రేతస్కుఁడగుచు
ఎట్టు లిపుడీలతాంగి చేపట్టగలడు
గాన తపమున సాధించగల నటంచు. 36

గీ॥ ఎట్టులైన నాదు పట్టిని హరునకే
యర్పణంబు సేతుననుచు నెంచి
తపము సేయుచున్న తరినా మహేశ్వరు
తాను బూజసేయ దపలె భక్తి 37

క॥ అంతటి యల్లుడు గలుగుట
యెంతటి వారలకొ వారలేమి తపంబుల్
సంతతము జేయుచుండిరొ
యింతటి వారలకు గాక యెటు జేకూరున్ 38

క॥ కావున నా హిమవంతుడు
భావమునం దలచె శంభు పదములు గొలుపన్
నీ వనితామణి హరునకు
నీవలయును నొరులకేయ నేర్తునెయనుచున్ 39

చ. సుత జనియించి నంతటనె సూరిజనంబులు సంతసింతురే
య తివకునీడు జోడయిన యట్టి విభుండొడగూడ కుండినన్
న్నతులిత సౌఖ్య సంపదల నందక యాసుత భర్తయింట దా
వెతలను బొందుచుండనది వీనులబడ్డ భరింప శక్యమే. 40

గీ॥ ఈడుజోడు జూడ నింపుగా వలయును
అరయ విద్యాబుద్ధు లమరవలయు
కులము గోత్రమందు కొదువయుండఁగరాదు
కలిమి బాంధవంబు గలుగవలయు 41

క॥ జనీజనకులు గలవాఁ
డనుజులు గలవాఁడు మన్మథాకారుండున్
ధనధున కెనయగు వానికి
తన కులజున కొసఁగ వలయు తనయుల నెపుడున్ 42

గీ॥ అట్టి వానికి సుత నర్పించువాఁడె బో
ధన్యుఁడై తనర్చు ధాత్రిలోన
కుందనమున మణుల గూర్పకమంటిలో
బొదిగియున్న కాంతిబొదలు నొక్క 43

గీ॥ సుగుణముల రాసియైన నాసుత జనించు
కతన నదీశు కులము ప్రకాశమయ్యె
కాంచనమునకు వాసన గలిగినట్లు
గంగచే దివి పూజ్యత గన్నరీతి 44

గీ॥ ఊర్ధ్వరేతస్కుఁడై హరు డుగ్రతపము
సేయుచుండగా నప్పుడు చిత్తమందు
నభవుదలచుచు ప్రమధ గణాదులెల్ల
నొక్కయెడను పవిష్టులై యుండిరంత 45

ఉ॥ పావని దివ్యగంగ దన భక్తి బయల్పడజేయు నోయనన్
గావనమెల్ల శుభ్రమయి గాంతి వెలార్చెను వాయు వామహా
దేవు తనూశ్రమంబు జనదేసువ నల్లన వీచుచుండెనా
స్థావర జంగమాత్మకుడు శంభుడు నిష్ఠ దపంబుసేయగా 46

గీ॥ విరులలో ద్రావి డాగిన విధముగాగ
నష్టమూర్త్యాత్మకుండైన యభవుడంత
నహరహంబును దనలోని యగ్నిఁ వేల్చి
దయిశకొరకో యనంగను దపముసేసె 47

గీ॥ కాంక్షితంబు లొసఁగు కల్ప వృక్షంబైన
శంకరుండు దపము సల్పుచుండె
నెద్ది గోరిసేయు నెవ్వరిఁ గూర్చియో!
యరయరాదు తెలియ నజునకైన 48

గీ॥ బద్ధ పద్మాసనుండౌచు పరమ శివుఁడు
తపము సేయుచు నుండెడి తరిని భువియు
వడఁకె గడగడ శేషుండు దాల్చెఁ దలల
దిగ్గజంబులు భీతిచె చేగ్గడిల్లె  49

క॥ అంతట హిమవంతుఁడు మది
సంతతముఁ భవుని పాద జలజాతములఁ
చింతన సేయుచు నుండియ
నంతర మాయుమను సేవకై నియమించెఁ  50

క॥ ఇట్టుల శంకరు కరుణను
గట్టుల యెకి మీఁడు వడసి కడువేగమునఁ
బట్టిని హరు పదసేవకు
నెట్టిన నియమించె కార్య నిపుణుం డగుచుఁ  51

క॥ ఏకారణమున మనమున
కేకాగ్రతఁ దపముసేయ నిడుములు గలుగుఁ
అకారణ మున్నప్పుడె
యేకాగ్రత సెడకయుందు రిల ధీమంతుల్  52

సీ॥ బంగరు సరిగంచు పాదాబ్జముల పైన
జీరువారగ వన్నె చీరగట్టి
సరిగ మొగ్గల తైక చనుగట్లు రాయిడి
చేత కాంతి మరింత జెలఁగుచుండ
కటిసీమ మొలనూలి గంట లల్లనమ్రోయ
నొడ్డాణ మలఁగౌతి నొలసియాడ
జవ్వని ముఖచంద్రు సరవి బట్టగవచ్చు
రాహువో యనవేణి రంజిలంగ

కలికి కుచకచ భరమును కటిభరంబు
సైపఁజాలక మధ్యంబు చలనమంద
శివుని సేవింపఁ వచ్చెడి చెలులఁగూడి
శంకరుని గెల్వ మరుడంపు శరమనంగ 53

క॥ తొల్లిటి సేవ మరువలే
దుల్లమునం దనెడి రీతి యుగ్రుని మదియా
పల్లవపాణి యొనుంగుచు
నుల్లాసము గూర్చుచుండె నొదవిన భక్తిన్ 54

గీ॥ సర్వదేవ మయుండైన శంకరునకు
దేవతా పూజకై పూల దెచ్చియిచ్చు
దినము భక్తిని నియమవేదికను దుడుచు
జలము దర్భలనిడు ననుష్ఠానమునకు 55

క॥ ఈ రీతి గిరిజ హరుపద
సారసముల గొలుచుచుండు సమయంబున నా
తారకుఁ డమరాల యమున
మారకుఁడై దిరుగుచుండె మదగజము క్రియన్ 56

క॥ అతులిత భుజబల యుతుడై
యతిక్రూరత నదితి సుతుల నందఱ మునులన్
వెతలన్ బెట్టుగ నార్తిన్
గతి యేమని యెంచి దాతకడకేగి సురల్ 57

గీ॥ ఇనుని సందర్శనంబున నింపుగాంచు
వనజములు వోలె నిర్జర వరుల మొగము
లంత వికసింపసాగె యబ్జాసనుండు
నిండు కొలువుండ గన్నుల పండువగుచు

క॥ కరములు శిరమున నిడికొని
యరుదారెడి భక్తితోడ నార్తి నమస్కలా
బరమేష్ఠి చరణముల కడ
పరితాము దీర్చుమనుచు ప్రార్థించి రొగిన్ 59

శా॥ అరవిందాసన యద్వితీయుడవు నీవట్లయ్యు మూర్తిత్రయం
బరయన్ నీవెరజోగుణంబునను బ్రహ్మాండంబు గల్పించి నే
ర్పరివై సత్వగుణంబునన్ బెనిచి బెంపారన్ దమోవృత్తిచే
పరమేష్ఠి ప్రళయం బొనర్చెదవు నిన్ భావింపగా వచ్చునే 60

క॥ నీవే వేదమయుండవు
నీవే యీ నిఖిలభువన నిర్మాతవుగా
నీవే నొంప భరింపను
నీవే కర్తయును భోక్త నిజముగ దేవా 61

మ॥ కరుణాసాగర కామితార్థఫలదా కల్యాణ సంధాయకా
పరమేష్ఠి, కమలాసనా, మునిసుతా, పాపౌఘ విధ్వంసకా
సురలోకం బిదె యార్తిజెందె యసుర స్తోమంబు గ్రుక్కించి యీ
వెరపున్ జెచ్చెరబాపి బ్రోవగదవే విద్యా సతీవల్లభా 62

వ॥ అనికర పుటంబులు నిటుల తటంబునఁ ఘటియించి
కట కటంబను వేల్పులయెడ బ్రసన్నుండై హిరణ్యగర్భుండు.

క॥ సేమమె యమరావతికిని
సేమమె యమరేంద్రునకును సేమమె దేవ
స్తోమమునకు మునిజనులకు
సేమమె యుద్యానములకు చింతామణికిన్ 64

గీ॥ కోర్కెలవి నాకు డెల్పుఁడో కొమరులార
చేతు నాచేతనైనంత శీఘ్రముగను
దివిజ వరులార ద్వాదశా దిత్యులార
ఇంక వగవకు డగును మీయీప్సితంబు 65

గీ॥ రాహు కబళన కలుషిత రాజబింబ
మట్లు ముఖ పద్మములు విన్ననయ్యె నేమి
దీనతను వెల్లడించె నిదేమినాకు
నెఱుఁగఁ జెప్పుడు దైన్య మదేలగలిగె 66

మ॥ అని యత్యాదరమేర్పడంగ దయనా యబ్జాసనా సీనుఁడా
డినవాక్యంబులు గర్ణపేయ మగుచున్ డెందంబు హర్షాంబుధిన్
మునుగన్ బాకనిశాటభంజనుడు సమ్మోదంబు దీపింపవే
గనులన్భావము వెల్లడింపుచు నుదాగాంచెన్ గురూత్తంసునిన్.

క॥ అనయము నమరశ్రేయం
బును మనమున దలచిదనడు బుద్ధివిశేషం
బునవెల్ల నరసి డెల్పెడి
ఘనుఁడగు సురగురుడు కరయుగము మోడ్చియనెన్ 68

చ॥ వినుము పితామహా యెఱుఁగవే త్రిజగంబులనేలు ప్రోథధీ
వినుతుడ వక్రవిక్రముఁడు వేయికనుల్ గలవేల్పు తారకు
డనునొక రాక్షసాధముని కాజిబలంబున నోర్వజాలకే
వనములఁ బట్టిపోయె పరివారస మన్వితుడై భయంబునన్ 69

చ॥ అనద విధంబువాటిలె నపారకృపానిధి యీసురాళికిన్
గొనకొని తారకాసురుడ కుంఠిత విక్రమబార మత్తుడై
కనివిని మున్నెరుంగ మనఘా మొనరించేడి క్రూరచర్యలే
మని వివరింతు డెల్ప తరమా! నసుబోటికి నోరువచ్చునే. 70

గీ॥ తల్లి గోల్పోయి మదిలోన దల్లడిల్లు
పిల్ల లట్టుల నసురులు భీతిజెంది
అరసి రక్షించువారులే రాయటంచు
నీకు శరణంబు జొచ్చిరి నిగమవేద్య. 71

సీ॥ అర్థి వాక్యములెల్ల నాలింపక యొసంగు
కామధేనువు వాని గాటి పశువు
కామితార్థములిచ్చు కల్ప మహీరుహం
బరయ నాతనియింట పెరటిచెట్టు
సంక్రందనుడు కూర్మి సతితోడ క్రీడించు
వనము రక్కసుల నివాస మిపుడు
చింతితార్థములను జేకూర్చు సురమణి
తారకాసురు చేతి దర్పణంబు

గీ॥ నగళులును గల్మి యూచముట్టుగ హరించె
యిదియు నదియని జెప్పగా వేలదేవ
చక్రి యనుజుండు దేవతా చక్రవర్తి
చెట్ల నీడయె నీడయై చిక్కెనిపుడు. 73

గీ॥ ఏల యీగోల నాకంచు నెంచి శివుడు
తరుణి పోయిన దాదిగా తపముసేయు
చున్నవాడయ్యె దేవత లున్నవారు
దిక్కు కొకరౌచు నార్తిని దేవదేవ. 79

గీ॥ తల్లి విషము వెట్టదలచిన ధారుణి
భారమన్న నెట్టు బ్రదుకవచ్చు
నీవు గావకున్న నీరజాతాసన
దేవతలకువేరు దిక్కు గలదె. 75

క॥ ఈరీతిదెల్పి గురుడును
తారకు ఁ బరిమార్ప దేవతానీకముకున్
కారణ జన్ముని యొసగుము
వారిజ సంభవ యటంచు వాక్రువ్వంగన్ 76

గీ॥ కష్టసుఖములు శకటచక్రములయట్లు
కలిమి లేములు కావడి కడవలట్లు
పోదెయ మవస పూర్ణిమ రాదెమరల
చింతసేతురె ధీరులాపంతకెపుడు 77

ఉ॥ నిర్జరులార ఘోరమగు నిష్ఠఁదపంబొనరించి మించెడిన్
దుర్జయుడై మదించి బహుదోసములన్ బొనరించు తారకున్
నిర్జితుజేయు చక్రియును నేరడు, మీరును నిత్యవిక్రమో
పార్జిత లీలనుండుడు శుభంబగు మీదట ధైర్యమూనినన్ 78

గీ॥ వరదలకు బొంగినది యెండ వారిపోవు
నుద్ధతుండయ్యు కుటిలాత్ముడు డుగుతుదను
ఫలభరంబున దలవాల్చి పాదపములు
మగుడ దలయెత్తు సుజనుల మార్గమిదియు 79

గీ॥ మంచివాఁడు కాలమహిమచే నొకపరి
తగ్గియున్న ఘనత తఱుగఁబోదు
సానబడిన యట్టిజాతిరత్నమునకు
ఎత్తుతగ్గు వెలయు నినుమడించు 80

చ॥ ఘనుడగు వాఁడు గెల్వగల కార్యముసేయుట లెస్సయట్లుగా
దనుచు నెఱి-గెనేని 'యనయంబది సేయక యుంటలెస్స మ్రా
కునవికసించు పువ్వులకు కొమ్మ కొప్పులఁజేరి యుండుటొం
డెను వనభూములందుఁ బడినల్గుట యొండెగదా గుణంబలన్ 81

గీ॥ పామునైనగాని పరగ బెబ్బులినైన
తానెబెంచి చంపఁ దగవుగాదు
కాన వరమొసంగి కాపాడి నాడనే
నిపుడు వాని జంపుటెట్లు పొసగు. 82

క॥ బలవంతుఁడు పైకొనునెడ
బలహీనుఁడు తగ్గియుంట బాగగు నదులన్
జలములు వెల్లువ వచ్చిన
తలవాల్చిన రెల్లునిల్చు తరువులు గూలున్. 83

గీ॥ సామమునవాఁడు మీకింకఁ జక్కబడడు
సన్నిపాత జ్వరంబుచే చచ్చువాని
కెటుల శైత్యోపచారంబు లింపొనిచ్చు
కాన నుడుగుడు సమయ సంక్రమము గనుడు.
వ. వాడే వడువున సమసెడి నోనుడువుడు వినుండని. 84

గీ॥ శీతనగముచెంత శివుడు తపముసేయు
చున్నవాఁడు శైలసుతయు నతని
సేవ జేయబోవు చెలియలతోఁ గూడి
యనుదినంబు భక్తి నమరులారా. 85

క॥ హరుని మన సెటులైనను
గిరిజ పయిన్గూర్ప వలయు కేవలయుక్తిన్
సరగున నటుసేయుడు వా
రిరువుర కుదయించువాడ హీన భుజుండున్. 86

ఉ॥ గౌరియు చంద్రశేఖరుడు గాంచు కుమారు డవక్ర విక్రమో
దారుడు భూరిసంగర విధాన కళాకుశలుండు లోక సం
హారకుడైన తారకున కంతము దెచ్చును నిర్జరాలికిన్
దీరు భయంబు మీరు వినుతింపగ వారల గూర్పగావలెన్ 87

వ. భీష్మంబగు గ్రీష్మా తపంబునకుఁ దలవాల్చి ధరిత్రి వ్రాలిన
సస్యంబులకుఁ దొలకరి చినుకులట్లు కమలాసనుని
వచనామృత వృష్టి చింతాజనిత దాహదోదూయ
మానంబులగు తమ మానసంబులకు చందన శీ
తలంబై యెసంగ నప్పితామహునకు బునః పునః
ప్రణామంబు లాచరించి తదాజ్ఞాను వర్తులై
సత్యలోకంబు వీడి యథేచ్ఛఁజనిరి జంభారియు
మీఁదటి కార్యంబెట్టులోకోయని తలపోయుచు
చతురోపాయ పారీణుండగు మీనకేతు నాత్మ
గతంబునం దలంచిన.... 88

సీ॥ సతిరతీ లిపుచ కుచాగ్ర కస్తూరికా
పంకిలో రస్కుండు భద్రపీఠు
డసమాన భోగలీలా భ్యాస చతురుండు
రతి కళాజ్ఞాన దురంధరుండు
నిశిత ప్రసవబాణ నిర్జితాఖిల లోక
చైతన్యుడఖిల విఖ్యాత యశుఁడు
యువ యువతీ ప్రణయోజ్జీవ జీవన పరుడిక్షు
కోదండ పండితుండు
గీ॥ మీన కేతనుడాది లక్ష్మీ కుమారు
డనుపమ విలాస రూప రేఖాంకితుండు
ప్రణయ సామ్రాజ్య జయశాలి భావికార్య
భార భరణంబునకు నింద్రుపాలి కరిగె. 99

క॥ వచ్చిన శ్రీతనయుని ప్రియ
మచ్చు పడందోడి తెచ్చి యాసనమిడితాఁ
మచ్చిక శిరమును మూర్కొన
చెచ్చెర సురరాజు వేడ్కఁ జెందుచు మదిలోఁ. 90

ఉ॥ అన్న కుమారుడంచు మది నాదర మేర్పడఁజేర జీరుచున్
మన్ననఁజేసి దర్పక, కుమారక, కోడఁలునీవు సేమమే
యెన్ని దినంబులో గడచెఁ నీనగుమోమునుగాంచి దైత్యులో
యన్న సదుస్సహంబయిన యాపదదెచ్చిరి నిర్జరాలికిన్. 91

క॥ అని కుందు సహస్రాక్షున
కనె మనసిజుడెంతొ మధుర మంజుల వాక్కుల్
వినవయ్య వగన నేటికి
ననుబోలిన కొడుకు గలుగ నగబలహారీ, 92

సీ॥ ఏకాంతలైన నీ కేకాంతములలోన
నలిగిన వారే యభ్యంతరమున
పతి దేవతావళిపై నిచ్చ జనియింప
పొంద జాలకమది గుందె దొక్కొ
కొమ్మ లెవ్వరలైన సమ్మతి లేకుండ
నీచెట్ట బట్టగా నెంచిరొక్కొ
విరహార్తి వారల వేగించి తముదారె
నిను వరియింపఁ బూనిక నొనర్తు

గీ॥ వేయి దెల్పగ నేటికి వినుమునాదు
భుజ బలంబున గెల్తునీ భువనములను
అబ్జ భవుడైనఁ గఱకంఠు డైనగానిఁ
యెత్తివచ్చిన దోలినీ కిత్తు జయము. 93

క॥ నాయంత సుతుడు గలిగియు
మీయంతటివారు వగవ మేలగునె వినుం
డాయంత కాంత కుందును
నాయమ్ములు జిక్కకున్నె నయతత్వనిధీ, 94

గీ॥ ఇంద్ర పదముగోరి యెవ్వార లేనియు
తపము జేయువాడొ తక్షణంబ
నీకెకాదు వినుము నెలతల కడగంటి
నీక్షణములతోన వెరవఁ జేతు. 95

గీ॥ రామ బాణము గురిదప్ప నేమొకాని
కాము బాణంబు దప్పనే గదిసెనేని
వేధనైనను త్రిపుర విరోధినైన
క్షణములో గెల్వకుండునే జంభభేది. 96

వ. అనవుడు.

శా॥ అన్నా! నీప్రియ బాషణంబులు నను న్హర్షాంబుధిన్ముంచె నీ
కన్న న్బంధువు నేమంచు కలఁడే యత్యంత బాహాబలం
బెన్న న్శక్యముగా దటంచెఱుగనే యీరేడు లోకంబులన్
నిన్ప్రాణంబుగ జాటుచుందురు గదా వేనోళ్ళతో నచ్చరల్. 97

గీ॥ అనుచు బల్కి కూర్మి నమర నల్లభుడంత
చేయిదీసి యతని చేతనునిచి
కార్యసాధనంబు గానింపు మాయంచు
చింత బాపుమనుచు మంతనమున. 98

చ॥ వెఱపు జనించు తారకుడు పెట్టెడిబాధల నోర్వలేమునీ
వెఱపును మాన్పితారకుని వేగన డంపగ వాహినీశుడీ
తఱి నుదయింపగా వలయు దానఁమహేశు మనంబు గౌరిపై
బఱగెడి రీతిజేయుమని ప్రార్థనఁ జేతును పంచసాయకా. 99

ఆ॥ కుడి భుజంబునీవు కులిశ మావలిభుజ
మగుచు నేలినాఁడ నమరపురము
పనికిరాదు మునులపట్ల నావజ్రంబు
చూడనీకు చొరని చోటులేదు. 100

గీ॥ అనుచు భుజమున కరముంచి యమర విభుఁడు
వేయి కన్నుల దీనత వెల్లడించి
విజయలక్ష్మిని గొనదన్న వేసరమ్ము
మరువ బోకన్న మదిని మా మాటలెపుడు. 101

వ. అని బలికి సవినయంబున వీడ్కొలిపిన సుకుమా
రుండగు మారుండు రతీ సహితుండై హితుండగు
వసంతుంగూడి తుహిన మహీధరంబు చెం
గటి మహేశు తపోవనంబు డాయంజనె. 102

ద్వితీయా శ్వాసము సంపూర్ణము.

ప్రాలేయాచల కన్యకాహృదయ నద్రాజీవ మత్తద్విరే
ఫాలీలా మృగహస్త నత్రిపథ గాంభః స్నిగ్ధ చంచజ్జటా
కాలాంభోధర నీలకంధర మహాకాలా సుధా ధామమౌ
శ్రీలావణ్య మయూంగ దైత్యహర శూలీ కాళహ స్తీశ్వరా. 103

గద్య.

ఇతి శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా వరప్రసాద సమాసాధిత
కవితా వైభవ కళురామ శర్మార్య తనయ
వాధాల గోత్ర పవిత్ర సుధీ జనవిధేయ
సరస కవయిత్రీ బిరుదాంకిత
గంటి కృష్ణవేణీ నావధేయ
ప్రణీతంబైన
గిరిజా కల్యాణంబున
ద్వితీయా శ్వాసము
సంపూర్ణము.

శ్రీ

# శ్రీ గిరిజా కల్యాణము

## తృతీయాశ్వాసము

క॥ శ్రీ రమణీ ప్రియవందిత
కారుణ్యాభరణ భక్తకామిత ఫలదా
ఘోరాది దనురి గర్వ ని
వారక శ్రీ కాళహస్తి వాయవలింగా. 1

—: వసంత వర్ణన. :—

మదన విలసితము.
మదన విలసితం బదియన నలరెఁ
ముదితల మదికిఁ ముదము గలుగగఁ. 2

క॥ సుర నికరోల్లాసంబై
యరుదారు వసంత సమయ మాసన్నంబై
విరులెల్ల బూఁచె వనమున
కురువక మందార వకుళ గోవర్ధనముల్, 3

మత్తకోకిల॥ ఆవసంత జయంతు డామరు డావనంబును డాయగా
ధీవిశాలుర మౌనివర్యుల ధీరతత్వము భంగమై
పోవ నావన కాంతయంతటఁ బూనెతాకయి సేయగా
మావికొన్నన మెక్కికూసెను మత్తకోకిల లెల్లడఁ. 4

ఉ॥ ఆకమలాసనుండు భువనాహ్వయ కేతకి పత్రమందుతాఁ
బ్రాకట మొప్ప చిత్రముల పంక్తులుగా లిఖియించె నోయనన్
బోకలు పొన్న గున్నలును పొల్పగు మావులు మల్లెమొల్లలున్
వీకనుఁబూచి చూడ్కులకు విందొనరింపుచునుండె నెల్లెడన్ 5

చ॥ చిగురుల మేల్మి క్రొంజిలుగుచీర కటిస్థలిదాల్చి యాత్మకిం
పుగఁ గయిసేసి నాథునికిఁ బూజ యొనర్పగ పూలదెచ్చె నా
దగు వనలక్ష్మి పుష్పిత లతా పరివేష్టితయై ముదంబునన్
నగు మొగమై యెదుర్కొనియె నాతులకయ్యది నైజమేగదా. 6

గీ॥ వనిత వనలక్ష్మికిని వసంతునకుఁ బెండ్లి
సమయమున జేయు సంగీత సభలనంగ
క్రొవ్విరులఁ దేనియలద్రావి క్రొవ్వియున్న
తేటి గీతంబు లెల్లెడ నీటుగుల్కె. 7

ఆ॥ వె॥ చిగురు కుసుమవన్నె చీరయై యొప్పార
పండుటాకు రైక పగిదిఁ జెలగ
పూతకమ్ర గంధ పుంబూతయై మావి
ఆటవెలది యనగ నలరె నపుడు. 8

గీ॥ కమల పరిమళ జలమును కరణియొసగ
పుక్కిటను బట్టి గజరాజు పూత్కరించె
తాను సగపాలు దినిన కెంపమ్మితూండ్ల
సత్కరించెను దనప్రియుఁ జక్రవాకి: 9

ఉ॥ సామజ రాజయాన హిమశైలకుమారి వనంబునందు నెం
తో ముదమార నెచ్చెలులతో విహరింపుచు నాటలాడుచున్
గోమునగేరు కొంచొడికిఁగోసె సఖీజను లుల్లసిల్ల దా
నామధు మాసవేళల శివార్చనకైన వపుష్ప గుచ్ఛముల్. 10

మానిని. ఆదెసమల్లెల నంటగబోవకు మయ్యవిగావలె నాకుననన్
ఈదెసరాకు సుమీయివి గోయగ నింపగుజూడు సువాసనచే
గాదిది సంపెగ లేదిది వాసన కామిని గోయకు వానినికన్
పోదమురండిక వాదనలేలని పూవులగోయుచు మానినులున్11

తరళ. తరళలోచన గాంచవేయటు ఘారుణింబడి మాధవీ
శరణటంచును వేడె నీపద సారసంబుల దీనతన్
కరుణ గాంచుమటంచు బల్కిన కాదు కాదిది నీదు సుం
దర తరాంగకవల్లి గన్గొని దాస్యమూనగ వచ్చెడిన్. 12

పంచచామరము. అదే కనంగ నయ్యెడిఙ్ ఆయారె రాజ హంసముల్
యిదేమి చిత్రమో యెరుంగ యీడకేల రావెయో
మదాల సాయటన్న బల్కె మానినీ త్వదీయమౌ
మదాలసంబు గాంచిసిగ్గు మార్కొనంగ నేగెడిఙ్. 13

(కవిరాజ విరాజితము)
కలయగఁ జూడవె కాంతరొ యాదెసకాంచనవల్లి మహోద్ధతిచే
కులుకు కుచంబుల గ్రుచ్చుచు తాపసిఁగూర్చెనుకౌగిట గాఢముగా
పలుకుల తీపిడి పల్కెడినాదెస భామిని కీరము లారయు మీ
తెలిసె నహాయవి తియ్యనిమామిడి తేనెల గ్రోలెడి కారణమౌ. 14

గీ॥ అఙ్ఘ్రు లెత్తియున్న యిఙ్ఘ్రుల గొమ్మున
గోకె జింకలెల్ల కోమలముగ
పద్మ పాత్రయందు పడతితోడను గూడి
నారగించె మధువు నళివిభుండు. 15

క॥ మరునకు కానుక వెట్టిన
కరణిని గనుపట్టె జూడు కాంతలతాంతం
బరసితి నీకై దెచ్చెడి
సరణిని జూపెట్టెననియె సఖి సరసముగఙ్, 16

వృషభగతి, రగడ
బోటి పువ్వులగోయ గానటు పోకు పోకుమటంచు బిల్చిన
ఏటిమాటలు బల్కెదరు మీరింత లింతలుజేసి చెప్పెదు

రమణి జూడుము రమ్యమయ్యె రసాలసాలము జూడు(జూడ్కికి
కొమరు మిగిలిన పూలగుత్తుల కొమ్మ కొమ్మరొ వంచబోకుము
లేమ జూచితె యీకురంగము లీల లీల విలోకనమ్ముల
రామ యీ వనలక్ష్మిజూడగ రానురానని యేల యంటివి
అల్లుకొనియె నశోకము నలతలంము నందము జూడు కోమలి
అల్లదే కనుగొమ్ము కోయిల యఱచె పలుచు( పంచమంబున
వనిత పువ్వులనుంచెదను చెఋవార వారణయాన కొప్పున
వనజలోచన యేటికే మరువమ్ము వమ్ముగ జేసి పోయెదు
కోకిలంబదె మావి చిగురుల కోరి కోరికదీర మెక్కెడి
మాకురావి వియేటిమాటలు మానుమానెద నీదుచెల్మిని
రామ యీలత కోమలము గోరంట నంటగ బోకునెచ్చెలి 17
ఆమయూరము బోయె బహుదూరమ్ము రమ్మది నీకు జిక్కదు
కందు కంబా పొదల(బడియెను కాంత కాంతమురావె వేగమ
అందుకై వెతబొందెదవు మదియందు నందది గాన నయ్యెడి
మేము బిలువగరావు నీకిది మేల మేలముగాదు నెచ్చెలి
కామినీయదె విరగబూచెను గాంచు గాంచనవల్లి నాదెస
ఆశుకంబుల పల్కులను విననందు నందర మేగుదమె చెలి
ఈశు పూజ యొనర్ప( బార్వతికిమ్ము యిమ్మగు నీసుమమ్ములు

సీ॥ నవ్వితి వేలనే నలినాక్షి సురపొన్న
తరువుల చెంగట దాచవలదు
యేమి మాటాడితో యింత సేపాదెస
కర్ణికారము పొంత కాంతనీవు
కాలదన్నితివేల బేల యశోకంబు
నీకొనర్చిన దొడ్డ నేరమేమి
బోటి పుక్కిట తమ్మ పొగడపై నుమిసితి
వపకారమేమి నీకది యొనర్చె

గీ॥ తాకితివదేల మామిడి తరువు నచట
యువిచ గోరంట కౌగిట నుంచితేల
చూచితివదేల తిలకంబు చోద్యమేమి?
కొమ్మ మూర్కొనె దేటికే కురువకంబు. 18

వ, ఇత్తెరంగున యమ్మత్త కాశినులు క్రొత్తయామని
పూగుత్తుల చిత్తంబులిగురొత్తం గోసికొని తత్తరంబు
నగం గోత్తమాంగుఁ బూజింప జనిరయ్యవసరంబున. 19

ఉ॥ రాలుగరంగ నచ్చరలు రంజిలవీణియ మీటుచుండగాఁ
మేలని పంచసాయకుడు మెచ్చగ కోయిలలెల్ల బాడినఁ
బాల శశాంకమౌళి కెద వాటిలకుండెను విభ్రమంబు నీ
లీలలకెల్ల ధీరులు చలింతురె వారు జితేంద్రియుల్ గదా. 20

గీ॥ కనక వేత్రంబు ఝుళిపించు కొనుచునంది
శంకరుని తపోగృహ బహిః స్థలములందు
చండ శాసనుడచట నిశ్చలముగాగ
నొప్పె చిత్రా కృతియనంగ నుగ్రువనము. 21

వ. అట్టియెడ.

శా॥ కనియెఁమారుడు నాగభూషణుని రాగద్వేష శూన్యాత్మున
త్వనయుఁ బాల శశాంకజూటు నభవుఁ హాలాహలాహారు,నూ
తన భస్మ ప్రవిలేపనాంగు అనవద్యాత్మ ప్రభాసంగునిఁ
ఘన పద్మాసన కృత్తివాసు జడునిఁ గంగాధరుఁ
రుద్రునిఁ. 22

గీ॥ గాలి లేకుంటు దీపంబు కరణివాస
లేక యుండెడి జలదంబు లీలనిస్త
రంగుడైయుంటు సాగరరాజు మాడ్కి
చంచలింపక ధ్యానించు శంభుగనియె. 23

గీ॥ తాపసులకైన బొందగాఁ దరముగాని
యట్టి పూర్వోక్త లక్షణుండైనవాని
ఫాల నేత్రునిగని భీతిఁ బారెమరుడు
బాణ బాణాసనంబులఁ బారవైచి. 24

క॥ వెరవున బరువిడు మరునకు
కిర మరుదగు రూప విభవ కాంతులచేతన్
సరుదారెడి గిరిజాత్మజ
పరిసరముల గాననయ్యె పడతులతోడన్. 25

సీ॥ చెంగావి వలిపంబు చుంగులు జారంగ
పడతి యొక్కతె కేల బట్టినడువ
రంగైన పైఠాణిరైక చాయలు తన
మేని కాంతులతోడ మేలమాడ
ముఖ సరోజమునకు ముసరు తేటులనంగ
నలక లల్లనవాయు హతిగలంగ
పొగడ పూదండలు పొలుపొంద నెదపైని
కర్ణావ తంసంబు కడువెలుంగ

గీ॥ పూవులను గోయఁ నలసియా పువ్వుబోడి
యలస గమనంబుతోజనె నభవుగొల్వ
చూచి మారుండు హరుగెల్వ సుకరమైన
శరమటంచును ధీరుడై జనియె మరలి. 26

ఉ॥ ఆమధుమాసమందు తుహినాచల కన్యకరత్న హారముల్
హేమ విభూషణావళుల నెవ్వియుదాల్పక సింధువారముల్
హేమ సరోజ హారముల నింపుగదాల్చి వసంత లక్ష్మినా
కాముని ధైర్యలక్ష్మి యనగాఁ జనుదెంచె మహేశు గొల్వగా. 27

తరళ॥ తరళ లోచనవచ్చె భక్తిని దైవత ప్రభుఁగొల్వఁగా
బరమ పావనుఁడైన శంభుఁడు బాలఁగన్గొని యోగముల్
విరతిఁజేసె మనోజ్ఞవీథిని వెల్గు జ్యోతినిగాంచి యా
వర కృపాళుని భక్తపాలుని వాంఛ యెయ్యదియోగదా. 28

గీ॥ నంది యేతెంచి ప్రణమిల్లి నగతనూజ
వెలదులనుఁగూడి మిమ్ము సేవింపవచ్చె
ననిన భ్రూసంజ్ఞ నాతని ననుప నౌత
డిందు ముఖులకు దెలిపెన య్యీశ్వరాజ్ఞ. 29

ఉ॥ శంకరు నానతింబడసి చానలఁగూడి సఖీలలామని
శ్శంక మహేశుచెంతఁ జని చక్కనియామని పూల నెల్లనే
ణాంక శిఖావతంసునకుఁ నర్పణసేసి యపార భక్తి నా
పంకజ పాణులెల్ల భువిఫాలతలంబులు సోకమ్రొక్కిరన్. 30

గీ॥ పద్మములకు మూగు భ్రమరంబు లట్టుల
గిరిజ హరునిపాద సరసిజముల
కెగునప్పుడలక లింపారె శంకరు
పాదయుగళిపైన పరిఢవిల్ల 31

క॥ మ్రొక్కిన దీవించెను భవు
డక్కటికముతోడఁ నగజ నతివరొ మదిలో
జిక్కిన కాంతుని బడయుదు
వొక్కప్పుడు నీకు సహితులుండ రటంచున్. 32

గీ॥ తామర పూసల హారము
నామానిని వినయమెసగ నందియ్య హరుం
డామాలికఁ చేకొనగన్
కాముండును సమయమంచు కార్ముకముగొనెన్. 33

క॥ బాలేందు శేఖరుండా
బాలామణి హారమొసగ ప్రమదముతోడన్
లీలా విలోకనంబుల
హేలాగతిగాంచె నానగేంద్ర తనూజన్ 34

గీ॥ భర్గుడొక్కింత ధైర్యంబు బాసియెదను
చక్కదనముల రాసియా చానమోము
గాంచె మమతను కన్నుల కరువుదీర
అగజసిగ్గున తలవాల్చి యుపనిగాంచె 35

చ॥ కనదన లస్ఫులింగములగాంచి మదంబునఁబోయి వానిపై
కొను శలభంబురీతి మదికోరిక లీరికలెత్త దర్పకుం
డును సురనాధు నానతి గడుంగడు సాహస ముప్పతిల్ల నెం
వెను సుమకాండ దీప్తికి వశీకృతుసేయగ ఫాలలోచనున్ 36

చ॥ కుసుమ శరంబు వక్షమున గుచ్చుకొనంగనె రుద్రకంతటన్
గపటగు కోర్కలింద్రియ లికారముచేఁ గలుగంగజొచ్చె నీ
యసదృశ చిత్త విభ్రమము కారయ కారణమే మటంచు వె
క్కసముగ ఫాలలోచనుడు గాంచెను రోషకషాయితాక్షుడై 37

చ॥ చిలుకల తేరిపై ముదము జెందుచు గూర్మి పడంతి గూడిపూ
ములుకులబోదు వింట శరముల్ సవరింపగ నల్లెత్రాటి డా
పలిచెవిదాకలాగి సుమబాణ పరంపర నేయజూడగా
బలియుడు ఫాలలోచనుడు వారక కాంచెను క్రోధమూర్తియై 38

చ॥ కనదన లస్ఫులింగ కణికాతతి కన్నులరాల భీకర
స్వనము నహుంకరించుచు నజాండ కటాహము బెగ్గడిల్లగా
నొనరిచి ఫాలనేత్ర జనితోగ్ర మహాగ్ని శిఖాచయమ్ముచే
గనలగఁజేసె రుద్రుడు వికారుని మారుని శ్రీకుమారునిన్ 39

వ. అంత వలపంతం గుందుచు భయ భ్రాంతులై

గీ॥ శాంతుడవుగమ్ము శివ మహేశ్వర యటంచు
సమర వరులెల్ల బ్రార్థించు నంతలోన
భవుని నేత్రాగ్ని మారుని భస్మముగను
జేసె దివిజాధి పతులెల్ల చింతిలంగ 40

చ॥ హరునయనాగ్నిచేసి హతుడైన మనోహరుగాంచి మూర్ఛిలెన్
దరుణి దవానలంబు సెగదాకిన కోమలవల్లి మాడ్కి నా
తరుణమునందు మూర్ఛయను దాని సహాయమొనర్చి దైవమా
మరుని వియోగ దుఃఖమును మాన్పెక్షణంబరతీమనంబునన్ 41

చ॥ హరు నయనాగ్ని కుల్కియిట నంబుజలోచన మూర్ఛనొందినన్
గిరివరుడెంతో నెమ్మదిని ఖిన్నతజెంది కుమారి నింటికిన్
కరుణను నెత్తికొంచరిగె కాంచగ గంధ గజేంద్ర మింపునన్
సరసిజ వాస్తుడైచనెడి చాత్రున దోపగ జూచు వారికిన్. 42

ఉ॥ తాపసుడైన యీశ్వరుడు దగ్ధముగా నొనరించి కామునిన్
కోపమునన్ విఘాతములు గూడును కాంతల సఖ్యమున్నయం
చాపరమేశ్వరుండు ప్రమథాళులతోడ నదృశ్యుడయ్యె నా
యాపదగాంచి శైలజ భయంబుననేగె సఖీ జనంబుతో. 43

క॥ పతి దుఃఖితయై మూర్ఛిలి
రతియంతట దెల్వినొంది రమణుని భస్మా
కృతిగాంచి కరయుగంబు
న్నత వక్షము మోదుకొంచు నాథాయనుచున్. 44

చ॥ దినమణిలేని యబ్జముల దీధిజి చంద్రుడులేని రాత్రియ
ట్లనువు దొరంగి యేనిదె యహా విలపింపగ జూడరావొకో
అనిమిష కార్యసాధనకు నైయిటు ప్రాణము లప్పగించితే
నిను విడనాడి జీవముల నిల్పగజాలను జీవితేశ్వరా 45

ఉ॥ హా సుకుమారమార దరహాస ముఖాంబుజ హా మనోహరా
హా సుశరీరసుందర మహావిభవోజ్వల శ్రీతనూభవా
నీసరి వానిలోకమున నేను గనుంగొన జాలనెంచునన్
హా సుమసాయకాయనుచు నార్తి నిగుందె విషాదవేదనన్. 46

చ॥ చతురంబోధి పరీతమైన యవనీచక్రంబు శాశించు శ్రీ
పతికిన్ ముద్దుల పట్టినయ్యు నకటా ప్రాప్తించెనే నీకు నీ
వెత లజ్జాపనుడిట్లు వ్రాసె నెకటా వీరాధి వీరా నినున్
సతమున్నమ్మిన నన్ను బాసి చనుటే చందంబు ప్రాణేశ్వరా 47

సీ॥ ఎవ్వాని సోయగం బీక్షింతు సతతంబు
నారూపమిటు భస్మమయ్యె నేడు
యెవ్వాని దరహాస మీకన్ను గవకింపా
నారూపమిటు భస్మమయ్యె నేడు
నే మనోహరమూర్తి నెడబాయ కుందునో
యామూర్తి యిట మాయ మయ్యెనేడు
యే మహావైభవు నేప్రొద్దు భజియింతు
నారూపమిటు నాశమయ్యె నేడు

గీ॥ లచ్చి తనయుండు లక్షణ లక్షితుండు
చంద మామల్లు డసమాన సుందరుండు
నేడిచట భస్మమయ్యెనే నేమనందు
నెటుల భరియింతు శోకాగ్ని నింకమీద. 48

గీ॥ పద్మములు నీట బాసియు బ్రదుకవచ్చు
విధుడు లేకున్న కలువలు విరియవచ్చు
నీదు దరహాస చంద్రికల్ నిగుడకున్న
నాదు హృదయ చకోరంబు నాధమడియు. 49

సీ॥ ఎటుబోయెనో చంద్రు డెటుడాగె నింద్రుడంతు
ప్రాణేశ నీకిట్టి పాటుగల్గ
నెటకేగె గోర్వంక లెటుడాగె గీరముల్
ప్రాణేశ నీవిట్లు భంగపడగ
ఎటకేగెనో బ్రహ్మ యెటనుండు నీతండ్రి
ప్రాణేశ నీకిట్టి బాముగల్గ
యెటమ్రగ్గె వనలక్ష్మి యెటుదూరె ధర్మపు
ప్రాణేశ నీకిట్టి రనటగల్గ

గీ॥ ఆవసంత జయంతాదు లరిగిరెదుం
మార సుకుమార లక్ష్మికుమార ధీర
హరుని కోపాగ్ని కింధనంబైన నిన్ను
గావగా నెవ్వరును రారు కనికరించి. 50

గీ॥ తరుణి కైదువ తనమింత దనరియున్న
పతికి నెచ్చోటనైనను మృతి గలుగునె
దాని మాంగల్య బలమున తథ్యముగను
నతడు జీవించు దీర్ఘాయుడగుచు భువిని. 51

శా॥ అని కాశ్మీర పటీరపంక రుచిరంబైయొప్పు వక్షంబుపై
దన హస్తంబుల బిట్టు మోదుకొని యత్యంతార్తి నామీనకే
తను కాంతామణి యేడ్చె నూర్ధ్వముఖియై దారాప్రవాహంబులా
స్తన దుర్గంబుల నుండిజారె హిమవద్గంగా ప్రవాహంబనన్ 52

క॥ అక్కట వేల్పుల కొరకై
యిక్కరణిన్ బ్రాణచయము లీనేర్తురొకో
ఎక్కడి త్యాగము ధర్మం
బెక్కడగల దింకగాతు రెవ్వరు నిన్నున్ 53

వ. అని వాపోవుచు దెసల్ బరికించుచు భర్తృ వియోగ
వియోగ వేదనా దోదూయమాన మానసయై విలపించు
రతీదేవికి. 54

గీ॥ అనల శుష్కనదీ పూరమందు జెలగు
మత్స్యకాంతకు వర్షాగ మంబువోలె
ఆసలన్నియు గోల్పోయి నట్టిరతికి
బలికె యశరీరవాణి యిప్పగిది కరుణ. 55

క॥ కను గొందువు నీపతిమది
నసుమానము వలదు వినుము హరుని తపోగ్నిన్
గనలిన కారణమునునే
వినిపించెద దుఃఖముడిగి వినుములతాంగీ. 56

చ॥ మును పితామహుండు తన ముద్దులకూతురు వాణితోడఁ
నెమ్మిని సుఖముండగా నటకు మీనని కేతనుడేగి యేయఁజూ
చెను మదికోర్కెపుట్ట సరసీజభవుండు మహాగ్రహంబునన్
త్రినయను లోచనాగ్నిబడి త్రెళ్ళుమటంచు శపించెనీపతిన్. 57

క॥ కమలాసను ప్రార్థించెను
యముడంతట భీతి సృష్టియగు టెట్లనుచున్
శమనంబు శాపమునకే
సమయంబున గలుగు పంచశరునకు ననుచున్. 58

క॥ గిరిజా కల్యాణానం
తరమున శాపంబుదీరు ధర్మద యనుచు
న్నరవింద గర్భుడాడెను
తరుణీ విధి దాటనేరి తరమౌ చెపుమా. 59

ఆ॥ అంతకు పితుడైనయట్టి బ్రహ్మకు శాంత
మెట్లు గలిగెనన్న నింతిజలధి

సగ్నిబుట్టి తోడ నమృతంబు బుట్టదే
యట్లు పొసగు బుధుల యాగ్రహములు. 60

గీ॥ ఈవియోగంబు సతమని యెంచవలదు
కొమ్మ దేహంబు గాపాడు కొనుచునుండు
మెండిపోయిన చెరువులు నిండుకొనవె
కుంభవృష్టియు జడిబట్టి కురిసెనేని. 61

క॥ ఇన సందర్శనమునకై
యనయంబును వేచియుండు నబ్జముల క్రియన్
మనమున ప్రియు సందర్శన
మును గిరిజాపరిణయంబు ముదిత దలచుచున్. 62

—: సూ ర్యా స్త మ య ము. :—

చ॥ చరమది శాంగనామణికి చందురు కావిముడుంగు గట్టినా
సురవనితా లలామములు జూడగ నిల్పిన దర్పణంబునా
వరుణునిరాణి నెన్నొసట వాసి జెలంగెడి కుంకుమంబునా
సరగున పశ్చిమాంబు నిధిజారె ప్రభాకరబింబ మంతటన్. 63

క॥ ధనమును గోల్పోయిన ని
ర్ధనికునివలె గాంతి హీనతను నాకసమం
దను వింతలేక యుండెను
దినమణి వడిఁ బశ్చిమాంబుధి నిమగ్నుండై. 64

క॥ వెలవెలఁ బారెని నుండును
కలకలమని ద్విజకులంబుగడు విలపించెన్
తెలియగ నెయ్యుర దుఃఖము
నిలమిత్రుల కోర్వజెల్లునే యెందైనన్. 65

సీ॥ కంజరీటములనగా నొప్పుకన్నుల
కాటుక దిద్దెనా నీటుగుల్క
భృంగ సంఘంబుల భంగంబొనర్చెడి
కొప్పున కల్వ పూగుత్తి దురిమె
కుంభి కుంభస్థలి కుద్దియై యొప్పెడి
యెదపైని కస్తూరి బొదవి కొనియె
సురరత్న ఖచితమై శోభిల్లు మేఖలా
భరణంబు లిడెకటి భాగమందు

గీ॥ పరగ ముత్యాల నీలియంబరముగట్టి
వలచి రేరాజు దనుజూడ వచ్చెననుచు
ముదము దైవార కైసేసి యెదురు సూసె
యామినీకాంత సంభ్రమ మావహిల్ల. 66

క॥ స్మరహరు శమనహరు గజా
సురహరు పురహరు మఖహరు సురనత చరణు౯
గిరివర తనయావరు భవ
హరుమురహరప్రియనిహారునహరహముంగొలుతు౯ 67

న ర్కు ట ము.

సకల గుణాభిరాము సురసన్నుత సుందరపా
దకమల నాగకంకణు సుధాకరమౌళి మహా
ధికు కరుణాసముద్రుని నదీవిటు హైమవతీ
నికలుష చిత్తచోరు సువివేకమున౯ దలతు౯. 68

శ్రీ శ్రీ శ్రీ

గద్య, ఇది శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా వరప్రసాద సమాసాదిత
కవితా వైభవ శ్రీ కఙ్గా రామశర్మార్య తనయ
వాధౌల గోత్ర పవిత్ర సుధీజన విధేయ
సరస కవయిత్రీ బిరుదాంకిత గంటి
కృష్ణవేణీ నామధేయ
ప్రణీతంబైన గిరిజా
కల్యాణంబున
తృతీయాశ్వాసము
సంపూర్ణము.



శ్రీ

# శ్రీ గిరిజా కల్యాణము

## చతుర్థాశ్వాసము

శ్రీ జ్ఞానాంబా వల్లభ
అజ్ఞానతమః పతంగ ఆశ్రితవరదా
విజ్ఞాన విమలదీపా
ప్రజ్ఞానబ్రహ్మ దేవవాయపలింగా. 1

—: చంద్రోదయము :—

సీ॥ అశరీరవాణి ముత్యాల హారమునుండి
తెగిరాలి పడిన ముత్తెములనంగ
అప్సరోంగనలెల్ల నభవు నర్చింపగా
రాలిన విరజాజి పూలనంగ
రమణి రోహిణిదేవి రాకేందు డేతేర
శిరముపై జల్లిన సేసలనగ
జేజేలు రక్కసుల్ జిలుకంగ నెగసిన
పాల మున్నీటి తుంపరలనంగ

గీ॥ మొనసిమిన్నేటి బుద్బుదములో యనంగ
నంధకారపుఁ జోరుల నరసిపట్టు
పసుపు రేరాజు భటులన బరగెనంత
మిన్కుమిన్కని తారలు మింటిపైని 2

గీ॥ జగము కనుమూసె నోయన సత్వరమున
నంధకారంబు నల్దెస లావురించె
జారచోరులు చింతనా జలధిమున్గ
నింగిపై దోచె కైరవిణీ విభుడుండు. 3

క॥ అలుగగ జలజాతంబులు
కలువలు విరియంగ దిశలు కాంతి సెలంగన్
నెలబొడిచె పశ్చిమాంగన
తలదాల్చిన మల్లె విరుల దండయనంగన్.

గీ॥ ఆభ్రభవనితకు వేణిపై నలరుచుండు
పుష్యరాగంపు బిళ్ళనాఁ బొలుపుమీరె
యెల్లదిశలందు వెల్లయై యెసగుచుండె
చుక్కలను గూడి సోముండు సొబగుమీర

సీ॥ అతిదినందనులెల్ల నమృతంబు భుజియింప
నుంచిన రజితంపు కంచమనగ
ప్రాగ్దిశాంగన కోర్కె పారిజాత సుమంబు
బంతియాడంగ చేఁబట్టెననగ
కల్పవృక్షమునందు గల తూర్పు కొమ్మన
పండిన బంగారు పండనంగ
గగన లక్ష్మిదేవికై సేయ నొసలందు
గట్టిన పాపట బొట్టనంగ

గీ॥ అరయ శశిచేతి తెల్లదామరయనంగ
మరుడు శరముల నొరవెట్టు మణియనంగ
కువల యాప్తుండు రోహిణిఁ గూడియంత
పొలిచె తూరుపు కొండపై పొలుపుమీర

వ॥ అంత నటభక్తవ శంకరుండగు శంకరుండ దృశ్యుండైన నాటంగోలె నగాత్మజాత స్వాతంబున చింతాక్రాంతయై నిర్ఘాథ నిర్వేదనా పరంపరల చేఁ గ్రాగుచు

సీ॥ భుజియింప నొల్లదు పొలతులతోఁగూడి
కందుక క్రీడలగాంచబోదు
పచ్చకర్పూరంపు బాగాలు గైకోదు
కైసేయఁగాబోదు కంబు కంఠి
దిద్దదు తిలుకంబు తీరుగానొసలందు
నిలువుటద్దము వంకనెలతజనదు
చెప్పదు పలుకులుజేరి కీరములకు
విరిసరుల్ ముడువదు వెలదిమిన్న

గీ॥ నిదురబోవదొకప్పు డేనియును తల్లి
కెరుగజెప్పదు మనసొక యింతవిప్పి
కూర్మిశంభుండు తన్నుగైకొన డటంచు
చింతచేజిక్కి నగమయ్యె చెలియమేను. 8

ఆ॥ కాంచు కన్ను మూయు గఱకంఠు ధ్యానించు
కలువరించు పలుకు కాంచినట్లు
నులికిపాటు నొందు నొల్లదు మాటాడ
భ్రాంతిజెందినట్లు బయలుగాంచు. 9

ఉ॥ హాయను, శంకరాయను, నహాయెటుబోయితివంచు దిక్కులం
బాయకజూచు నన్ను నెడబాయుట నాయమెయంచుబల్కు
నాహాయకలంక మూర్తియను నందవిపంచున కానజెందితా
హాయను నీరు కన్గొలకులందు బొరిం బొరిజాలు వారగన్. 10

క॥ మదవతి విరహానలమును
మదినోర్వగ లేక మందమలయా నిలముల్
గదురగ నులుకుచు దృక్కుల్
చెదరక గనుగొనియె మింట శీతాంశా నొగిన్. 11

(చంద్రాద్యుపాలంబన)

ఉ॥ హా చెలులార యేల యిప్పు యిప్ప డంబుజ బాంధవుడిట్లు వేచెడిఁ
కాచెడి నమ్మ వెన్నెలలు గామ పవల్ తపనుండు లేడనఁ
హా చతురాస్య వందిత పదాంబుజ హా భువనైక మోహనా
నీచెలి పీడనాయమె వినీలగళామృత శరీర శంకరా 12

మ॥ అనుచుఁ గన్నులభాష్పముల్ దొరలగా నబ్జాక్షియా శంకరుఁ
మనమందెన్నుచు నెచ్చెలింబిలచుచుఁ మారుండు క్రూరుండుహా
యనుచుఁ మత్ప్రియు నెట్లుచూతు ననుచుఁ హాశంకరా రాగదే
యనుచుఁదైన్యముదోపగా శశిధరుఁ ధ్యానించి మూర్ఛిల్లినఁ 13

గీ॥ చానలంతట శైత్యోపచార విధుల
వివిధగతులను గావింప వెలది మిన్న
మెల్లమెల్లనగను విప్పి మింట వెలుగు
తోయజారిని దూషింప దొడగెనిట్లు 14

క॥ తెలియక దోషా కరుడని
దలపై నిడుకొనియె కూర్మి దనరగ హరుడున్
తెలిసి గురుద్రోహివటం
చలనేత్రాగ్నులను మాడ్చుననయముని నుఁ 15

క॥ నెలతలనేచుట తగునా
తులువతనము గాదె నీకు తోయజవైరీ
కులమైన దలపవకటా
పలుగాకి చేయరాని పాసముగలదే 16

ఉ॥ కాదిది చంద్రబింబముగుగాని, దవాగ్ని, కణంబు, చూడగా,
గాదిది, తారకాచయము, కన్గొన, భాసుర, విస్ఫులింగముల్,
కాదిది లేత, వెన్నెల, వికాసము, పావక, చండ దీప్తియే,
కాదిది రేయియంచు, గిరికన్యక, బల్కె, వియోగ, వేదనన్. 17

సీ॥ అమర నాయక నంద నారామ వాటికా
పారిజాతల తాంత పరిమళంబు
దక్షిణాధీశు శుద్ధాంత కాంతాజన
స్తనసంభ కస్తూరి సౌరభంబు
నిర్జర వరవధూ నిటల విలాస ము
ఘూరఘనాళి సాక్షి సార చయము
త్రిదివేశ గంగా మదిమల శీకర
సమ్మిళితాముల శైత్యగరిమ
గీ॥ గొనుచు మలయాచలంబున గొంతపొద్దు
విశ్రమింపుచు నల్లన వేడ్కపొడమ
వచ్చెతు హిమాద్రి కడనున్న వనమునకును
మలయ పవనుండు బహలిక మందగతిని 19

వ॥ అంత సమీరు నుద్దేశించి

ఉ॥ ఓయి సమీరమా వినవె యొక్క రహస్యము నీకు దెల్పెదన్
బాయక సర్వభూతముల ప్రాణము నీవయి యుందు వందురీ
సాయము జేయు మయ్యనిను సంతతమున్ భజియింతు నయ్యనే
నీ యుపకారమున్ మఱవ నెప్పటికైన మహేశు నానగా 20

గీ॥ నన్ను జేరగ రాకు మోయన్న నీవు
అభవు మదిలోని దానినై యనవరతము
నుండుపని విందునందుల కంపు నొకటి
జేయుమా నాకు దయసేసి శీఘ్రమునను 21

గీ॥ భువిని నిన్ను బలంబునఁ బోలరెవరు
గాననీ రెండు కరముల గరళకంఠు
నెత్తి విసరుము లేకున్న సిద్ధచరిత
నన్నెహరునకు విసరి పుణ్యమునఁ బొమ్ము 22

క॥ అనితన సౌందర్యమునకు
ననువగు వన్నియను బెట్టనతి ధైర్యమునన్
దనమది సంకల్పించెను
వనమున దపమాచరించి పల్లభుఁ బడయన్ 23

ఆ॥ వె॥ గట్టిపట్టుఁ బట్టెఁ గట్టులయొకిమీని
కూతురంత గిరుల ఘోరతపముఁ
జేసియయిన శివుని జేకొందు భర్తగా
బేలయటులపగవ నేలయనుచు 24

వ॥ తలచి తనతలంపు తల్లికి తెల్లంబుసేయ నప్పల్ల
వాధర నెచ్చెలిం బుత్తెంచిన 25

—: సూర్యోదయము :—

క॥ కనువిచ్చు జగము లికపై
ననిదెల్పెడి రీతి కుక్కుటా రావంబుల్
విననయ్యె కొక్కొరోకో
యని చోరుల గుండె లెల్లన వియగ నంతఁ 26

గీ॥ లోక బాంధవురాక ముఁల్లోకములకు తెలుపగా
వచ్చెనోయన తేజరిల్లె
కాలఫణి భోగరత్నంబు లీలమింట
వేగుచుక్కయు తూరుపు వీధియందు 27

మ॥ కలనైనఁ నినుదక్క నన్యుని గనఁ గాంక్షింపవీ కల్వ నె
చ్చెలులఁ గుందగజేసి పశ్చిమదిశా సీమంతినిం గూడబో
కలుషంబంచు దలంపవైతి వనితన్గ న్గొంచు దూషించు వా
రలొనామ్రోసెను నవ్వనంబున ద్విజారావంబు లొక్కుమ్మడిన్ 28

ఉ॥ నెచ్చెలికాని రాకగని నెమ్మది నుబ్బుచు నవ్వెపద్మముల్
బొచ్చెములేని ప్రేమమున బొంది ప్రియుండెడబాసె నంచెదన్
వెచ్చనియూర్పు గాడ్పులను వేగుచు మోముల వాల్చె దీనతన్
చెచ్చెర కల్వకామినులు శీతమయూఖుడు వ్రాల నత్తరిన్ 29

గీ॥ కాంచనంబును గొనితాను గరగఁ బోసి
రసముగాఁ జేసి వేయి కరంబులందు
భువన భాండంబునకు బూత పూయుననగ
భానుడు నయించె పూర్వ దిగ్భాగమందు 30

వ॥ అంత నొకయింతి పురంబున కరిగి హిమవంతునిం
తింజేరి మంతనంబున గిరిజ నిశ్చితం బెరుంగఁ జెప్పిన 31

క॥ అమ్మ కుమారి శివునిపై
నెమ్మనమిడి దీక్షబూన నిశ్చితమతియై
సమ్మది వేడగ దమపా
దమ్ముల కడకనిపె నన్ను తామరసాక్షి. 32

క॥ అని బలికిన చెలిపలుకులు
వినిమేనక నెమ్మనమున వేదన పడుచున్
ననుగన్నతల్లి యెవ్విధి
నిను బాయుదు తపముసేయ నీచేనౌనే 33

క॥ అని మిగుల వగల బొగులుచు
తనయను జేరంగబోయి తద్దయు ప్రీతిన్
జననియు పలుతెరగుల నా
వనితను వలదనుచు నెంతొ వారించె తుదిన్ 34

క॥ తపమనిన శీత వాతా
తపముల కోర్వంగవలయుఁ దత్పర మతితో
చపలాక్షి యుండవలయును
తపమనగా మాటలౌనె తరుణుల కగునే 35

సీ॥ సౌదాంగణంబుల సంచరింపగలేవు
నిటుమురా నేలం [illegible] లవె
కేళికా వనుల క్రీడింప భయమందు
[illegible] కాంతారముల నలయగలవె
ముత్యముల్ సూత్రాన మొనసి గూర్పగలేవు
దృష్టిని నిల్పుదే ధృతముగాగ
[illegible] స్పత్రాలు [illegible]
పతిని నేర్తువె యాసనాది విధుల

గీ॥ బాల్య చాపల్యమొందక బాలమదిని
స్థాయిగాఁజేసి షడ్దళ చక్రమందు
శంకరుని నుంచి ధ్యానంబు సలుపగలవె
నియతులన్నియు బాటింప నేర్తువమ్మ. 36

గీ॥ ఎంచ రెండరో తన గర్భమందు పుట్టి
యుండినను చందురుని గాంచియుబ్బుచుండు
సాగరుని మాడ్కి నీముఖ చంద్రుఁగాంచి
పొంగుమామక సంతోష పూర్ణజలధి 37

గీ॥ వల్కలాజిన వసనవై వనములందు
తల్లి తాపసివై నీవు తపమొనర్ప
పట్టు పట్టంబులను గట్టి బహువిధముల
భోగినై నేను సుఖముల బొందుటెట్లు? 38

క॥ అనిపగల బొగులు చుండెడి
తనతల్లిఁ గాంచి పల్కె తల్లీ వగవఁ
బనిలేదు తెల్పెదను నా
యనలాక్షుని భక్తిగరిమ నాలింపగదే. 39

తరళ॥ వరకృపాళుఁడు భక్తపాలుఁడు నాంచితార్థ దుడీశుఁడున్
పరగ దీనదయాళుఁ డాశ్రిత పారిజాతము భర్గుడే
యెరుఁగవీవు మహేశు సత్కృప కెద్దిసాటి జగంబునన్
సరగునన్ గొనితెత్తు బంధము చంద్రశేఖరు సత్కృపన్. 40

గీ॥ శంకరునిజేరి శరణన్న సర్వజనుల
యభి మతార్థంబు లొడఁగూర్చు నమ్మనేను
దీనమందారు నభవుని దేవదేవు
పాదములవేడి కోర్కుల బడయఁగలను. 41

క॥ నెమ్మది వగవగ నేమిటి
కమ్మానెలదాల్పు భక్తినర్చించిరఁదీ
యమ్మగుకోరిక బడయుదు
లెమ్మా మది చింతవలదు లేశంబేనిన్ 42

చ॥ అడవిని క్రూరసత్వచయమమ్మ రొయెగ్గొనరించు నంచునా
కిడుములు గల్గునంచు మదినెంతు వదెంతటి వెఱ్ఱిదానవే
పుడమిని సర్వభూతముల బ్రోచుచు నొంచుచు సృష్టిఁజేయు నె
వ్వఁడు శివుడా మహేశ్వరుని ప్రాపుననుండిన యెగ్గుగల్గునే 43

క॥ నిప్పునకు చెదలు పట్టునె
కప్పునె చీకటులు సూర్యకాంతుల కెందున్
అప్పరమేశుని భక్తుల
కెప్పు డెవండెగ్గు సేయనెంచునుఁ దల్లీ 44

గీ॥ అతని యాజ్ఞలేక అమ్మరో కదలునే
భూమినో లక్కరెల్లు పుల్లయైన
హరుని కృపకు పాత్రులయి నట్టివారల
కెగ్గుసేయువార లెవ్వరమ్మ 45

వ॥ కప్పురంపు పలుకులంజలె స్వచ్ఛంబులై మరంద బిందు
సందోహంబులంజలె మాధుర్యంబులై వీణాకల
కలంబుల పడువున లలితంబులై చిలుక ప
లుకు లంజలె హృదయ రంజకంబులై ఆగమం
బుల మాడ్కి వేదాంత తాత్పర్యంబులై అభంగ
గంగా తరంగంబుల రీతి నిర్మలంబులై మలయ
మారుతంబులజలె హృదయంగ మంబులై వెలయు
నక్కలికి పలుకులు వీనుల విందొనర్ప గట్టిపట్టున
పట్టి తన్నుంబోలు నోపునని గట్టుల రేడెంతయుఁ
బ్రహ్మానంద రంగుండై కులదీపంబగు కూతుం
గౌగలించుకొని శిరంబు మూర్కొని యానందాశ్రు
లచేఁ దడుపుచు తపంబునకేగ ననుమతియి
డి యిట్లని దీవించె. 46

ఉ॥ ఆయ శరీరవాణి ధరనష్ట దిశాదిప్రలెల్ల భూతముల్
కాయల కందమూలముల కాలము బుచ్చెడి మౌని వర్యులుఁ
పాయక సర్వభూతముల ప్రాపయియుండెడి వృక్షరాజముల్
నీయెడలం బ్రియంబెసగ నీకొడ గూర్తురుగాక నిచ్చలుఁ 47

మృగములెప్పుడు మైత్రితో మెలగుఁగాక
తరువు లొసగుత ఫలపుష్పతతుల నెపుడు
ఇనుడు సోముండు రక్షింతు రనుదినంబు
ధర్మదేవత గాపాడు దయను నిన్ను 48

వ॥ ఇవ్విధంబున నయ్యగజ 49

క॥ జననీ జనకుల యనుమతి
గొని గౌరీనామ శిఖర కూటంబునకుఁ
జనె కూర్మి సఖియ లిరువురు
తను గొల్చుచు వెంట నడువ తపమొనరింపఁ 50

సీ॥ బంగారు సరిగంచు పట్టుపుట్టము మాని
వల్కలంబుల గట్టి వనిత నేర్చె
బహుభక్ష్య భోజ్యముల్ భక్షించుటలు వీడి
నాకలంబులు దిన నభ్యసించె
అగరు ధూపములచేఁ నలరు పెన్నెరివేణి
జడలుగా నపరించు వడవునేర్చె
పూసెజ్జపై క దిపోయెడి సుశరీర
కొండరా నేలల బండగలిగె

గీ॥ ననల కోసిన కందెడి నళినహస్త
అపుడు దర్భలగోయగా నభ్యసించె
అంచలకు యానముల నేర్పునట్టి ముగుద
నేర్చె పద్మాసనము వెట్ట నిష్ఠతోడ, 51

గీ॥ అంగ రాగంబులను మాని యబ్జగంధి
అంగ రాగంబుగా భూతి నలదికొనియె
మణిమయ విభూషణంబుల మానియంత
తరుణి రుదురాక పేరుల దాల్చెభక్తి. 52

గీ॥ రమణి రారాపు చనుదోయి రాపిడులకు
వల్క లాజినములు మార్దవంబు గాంచె
దొడ్డనారిని జేరినదుష్టుడైన
సజ్జనుండౌటయును లోక సమ్మతంబు 53

క॥ ఆవనమున తరుషండము
పావన మునిజనము పగిది ఫలము లొసగుచుఁ
గావించు నతిథి సత్కృతి
యేవేళను గౌరినిష్ఠ కెట్టి మహిమయో. 54

గీ॥ ఎప్పు డెవరికేని యొగ్గు సేయగబోక
కడు ప్రకూటి కొరుల నడుగబోక
తమ సుభాషణములఁ దనియంగ జేయుచు
తపసి వరులనచట దగెద్విజాళి. 55

క॥ పులులును హరిణంబులు నొక
పొలమున మేయంగసాగె, పొత్తున సింగం
బులు మదగజములు నొక్కట
గలసి మెలసి తిరుగుచుండెఁ గ్రౌర్యములేకన్. 56

చ॥ పెనిచెలతా వితానముల ప్రీతిసెలంగ ఘటోదకంబులన్
దనుపమ గాత్రిముంను తనకాత్మజు డుద్భవమైనగాని యీ
ఘనమగు ప్రేమవీడ నటుగాంచుచునుండి యహర్నిశంబులున్
దినదినమున్ శ్రమించి వెనుదీయక బిడ్డలబెంచు చాడ్పునన్. 57

క॥ ముడిఁవడి చిక్కులు పడిపెన్
జడలయి యొప్పారె కురులు చాన మొగమునన్
బడి వింత సొబగు గూర్చెను
కడు నాచులమధ్య వెల్గు కమలము భాతిన్. 58

చ॥ తరళ విలోకనంబులను తామరసాక్షి హరించునంచునా
హరిణ కపోతముల్ జన భయంపడు వానిని జేరదీయగా
తరుణి యుదారచిత్తమున ధాన్యము దర్భలఁవెట్టి మచ్చికల్
జరిపి భయంబు బాపు మృగశాబ విలోచన తానుగావునన్. 59

ఉ॥ కాంచన మేఖలాభరణ కాంతులుజిమ్ము కటీ స్థలంబుపై
నంచితలీల కర్కశ కుశంబుల నల్లిన ముంజిగట్టగా
నించుక నెఱ్ఱబారె నడుమింతికి దాపిడిచేత నద్దియున్
మించెడి పద్మరాగమణి మేఖలయోయన నొప్పె యింతికిన్. 60

ఉ॥ స్నానము హోమముంజపము సల్పుచు భస్మవిభాసితాంగయై
ధ్యాన నిమగ్నయై యచలతన్ తపనిష్ఠ యొనర్చు చుండుటల్
మౌనులుగాంచి పర్వతకుమారినిఁ జూడఁగ పర్ణశాల కెం
తేని ముదంబుతోడ జనుదెంతురు పిన్నయటంచు నెన్నకన్. 61

క॥ ఈరీతి పెక్కు దినములు
ధీరత తప మాచరించి తీవ్రతలేమిన్
జేరడు శంకరుడని కడు
ఘోరంబగు తపమొనర్చె కోమలియంతన్ 62

గీ॥ మండు వేసవి పంచాగ్ని మధ్యమందు
జోరువానల బయళుల సుదతినిల్చి
పర్ణ భక్షణమేది తపంబు సల్పె
మునులకెల్లను నాశ్చర్యమును ఘటింప 63

ఆ॥ వె॥ మేఘమధ్యమందు మెఱపు తీగయువోలె
వర్షఋతువు నందు వనిత యొప్పె
చంద్రుడయ్యె వెలది శారదవేళల
భక్తి యంతకంత ప్రబలుచుండ 64

క॥ హేమంత ఋతువు నందా
భామామణి జలములందు బద్ధాంజలియై
కామారిఁ దలచుఁ చుండెను
శ్రీమానిని కమల గేహ సీమన్ బోలెన్ 65

క॥ పంచాగ్ని మధ్యమందా
పంచానన మధ్య నిలువబడి ధ్యానించెన్
మించెడి కాంచన లతయన
నించుకయును వాడదయ్యె నింతి వదనమున్. 66

క॥ బంగరు కమలంబుల నీ
యంగనను సృజించియుంచు నబ్జాసనుడా
శృంగార మింత వాడక
నంగశరము పోలెనుండె నగ్నుల నడుమ౯. 67

క॥ ఇటువలె ఘోర తపంబును
పటుతర నిష్ఠాగరిష్ఠ బాలికసేయ౯
కుటిలత భూసుర వేషుడు
వటు వొక్కండాశ్రమంబు వద్దకు జేరె౯. 68

సీ॥ అమర గంగాప్రవాహంబన నెదపైన
జన్ని దంబులు వింతసొరుగుల్క
హరినీల శకల చయంబుల కైవడి
రుదురాకపేర్లు పేరెద నటింప
సంజ కెంజాయల సరణి నొప్పారెడి
కాషాయ వస్త్రంబు కటివెలుంగ
దిగ్దంతి దంతప్రదీప్తినాఁ నొసలిపై
భస్మ త్రిపుండ్రంబు భాసిలంగ
గీ॥ భక్తి పంచాక్షరీమంత్ర పఠనమునను
నవిరళానంద మూర్తియై యచల తనయ
తప మొనర్చెడి యాశ్రమ తలముఁజేరి
కపట భూసుర తిలకు డక్కాంత గనియె. 69

వ. అంతట.

చ॥ కరములు దోయిలించి పదకంజ యుగంబున దృష్టిసార్చుచు౯
శిరమటు వాంచిభక్తి మెయి చేడెల గన్గొన నర్ఘ్యపాద్యము౯
సరగున దోడితేర ద్విజచంద్రుని కంతటఁబూజసేసె నా
వరయువతీ లలామయనవద్య చరిత్ర నగాత్మ జాతయు౯. 70

క॥ ఆయాతిధ్యం బంతట
మాయా విప్రుండు గొనుచు మానిని నామా
ర్గాయా సంబంతయు జనె
నీయాతిధ్యంబువలన నిప్పుడు తరుణీ. 71

గీ॥ అనుచు సేదదేరు టభినయం బొనరించి
వేడి యూర్పులంత వెలికి విడిచి
చిలువ చెలువ యనగ చెన్నలరారు నా
తరుణిగాంచె దృష్టి దప్పకుండ. 72

గీ॥ కాంచి తలయూచి పలుకగా గడగి కొంత
సంశయంబంది దిక్కుల చక్కజూచి
పలుక నిమ్యుక్తుడై నెల్ల బలుక దొడగె
పొలతి తపమున కనువెయీ ప్రోలునీకు. 73

క॥ చేరువ నున్నవె జలములు
సారస దళనయన భీతి సలిపెడి మృగముల్
చేరగ రాకుండును గద
నారాధింతువె మహేశు నశ్రాంతంబుజ. 74

గీ॥ ఆతివ నీచేతనున్న దర్భాంకురముల
నందుకొన నాస నేతెంచు హరిణచయము
కాంచి కోపింప కుందువే కనికరించి
తాపసుల కాగ్రహంబెప్డు తగదుగాన. 75

ఉ॥ క్రూరమృగంబు లెన్నడిట గ్రుమ్మరకుండును గాశలోదరీ
భూరుహముల్ ఫలంబులను బొల్పుగ నిచ్చుచు నుండునే
కదా! గారవమొప్ప నీవు పెనుగాశికి నోర్చి ఘటోదకంబు లిం
పారగబోసి పెంచిన నుపాయనమిచ్చునె నీకు నీలతల్. 76

చ॥ చెలువుగనీవు నీసఖులుఁచేరి ముదంబున బంతు లాడుచుఁ
చిలుకలజీరి పద్యముల జెప్పుచు నింట వసింపకుండ చెం
గలులవబోలు హస్తముల కర్కశ దర్భలనూని యీగతిఁ
గలికివనాళి గ్రుమ్మరుచు గాసిలనేల యెఱుంగఁ జెప్పుమా. 77

చ॥ అవిరళమైన నవ్య మృదులాంబరముల్ ధరియింప కీట్టులో
యువిదరొ వల్క లాజినము లూనగనేమి కతంబొ దెల్పుమా
నవనవలాడు జవ్వనము నాయెమె యీగతి వమ్మొనర్పగా
నెవరిటు లెగ్గుసేసిరొకొ యేమన జెల్లును వారి నక్కటా. 78

గీ॥ చెనటి సర్పంబు సిగపైని జెలగునట్టి
మణికి జేసాచునే యెట్టి మనుజుడైన
వెలది నినుబోటి కెగ్గు గావించునెట్టి
ధీరుడాతని నొక్కింత దెలుపు మబల. 79

క॥ కొండవలెఁ తండ్రి యుండగ
నండ జయానా కొరంత యావంతయు నీ
కుండునె దపమేటికి యీ
కొండలఁబడి చేయుచుందొ కోరికయేదో. 80

గీ॥ భర్తచే నవమానింప బడితివన్న
కన్నెవని తోచు నీదగు వన్నెజూడ
తల్లిదండ్రులచే నెగ్గు దవిలెనన్న
బాల యామాటలను టసంభవముగాదె, 81

గీ॥ వరునకై యిట్లు దపియింతొ వనితయన్న
దీర్ఘ నిశ్వాసమును బుచ్చ దెలిసికొంటి
ఎంత కాలంబు దపియింతు విట్టులేత
యవ్వనము గొల్ల బెట్టుచు నబ్జగంధి! 82

క॥ పెనుబండయొ వజ్రంబొ
యినుమో నీపతి మనంబు యించుని భాస్వా
మునివలె నుండెడి నినుగని
మనమున నెటులోర్చె యకట మనసో కాదో. 83

ఆ॥ వె॥ ముదిత బ్రహ్మచర్యమున నేనొనర్చిన
తపమునందు సగము ధారబోతు
నీవు భర్తయెట్టి నిరుపమాకారుడో
దెలుప వచ్చునేని తెలుపు మబల. 84

క॥ కరము కృశించె శరీరం
బరుదారెడి యవ్వనంబు నడవిం గలసెఁ
యెరియదె యాతని మనమున
తరుణీ మాబోంట్ల మనసు తాళదు సుమ్మీ

వ. ఇవ్విధంబున బలుకు నమ్మాణవ కొత్తముంగాంచి. 85

ఉ॥ ఎక్కడనుండి వచ్చితిరొ యిచ్చటి కెయ్యది కారణంబొ మీ
రెక్కడికేగనెంచితిరొ యివ్వన భూముల పుణ్యమూర్తి
నీచక్కని నామమెయ్యదియొ చంద్రకళాధరుబోలు నీముఖం
బక్కమలాస నాన్వయుడవంచు వచించెడి భూసురోత్తమా 86

వ॥ అని పలుకు నయ్యంబకు కుహనా భూసురుండిట్లనియె

గీ॥ వినుము నాకులంబు వెలది రోయనుకూల
మతివ సమ్మతంబె యగు మతంబు
నామధేయ మన్న నాతల్లిదండ్రులు
పేరుబెట్టి చేరఁబిలుచు టెరుగ 87

గీ॥ అవిరళ బ్రహ్మచారినై యడవులందు
కందమూలా శనంబుల కాలమెల్ల
కాలకంఠుని సేవచేఁ గడపుచుందు
శాంతమతి నయి యేవేళ సరసిజాక్షి. 88

కII భూసురకుల సంజాతుడ
భాసురమతి యీశుసేవ బాయని వాడ ౯
నాస యొకింతయు లేదెవ
నీసచ్చరితంబు జెవుల నింపుదువెచెలీ 89

కII తలపకు మన్న్యునిగానను
కలికీ నీ యతిథి పూజకై కొనినాడ౯
జలికిన నేతు వచనముల
నలవడు సజ్జనుల మైత్రి యందురు విబుధుల్ 90

కII ఘనమగు నీ కోరిక విన
మనమున నుత్సాహమయ్యె మానిని చెప్పమా
యన లేతనవ్వు దోపగ
వనజాయత నేత్ర చెలియవంక గనుగొనె౯ 91

వII అంత యన్నెలంత కనుసన్నలోని భావంబెరింగి యచ్చెలి విప్రున కిట్లనియె.

చII వినమది నెంతువేని విను విప్రశిఖామణి యీల తాంగి కాం
చనగిరి ధన్వి శంకరుని శాట విభంజను పెండ్లి యాడగ౯
మనమున గోరియిట్లు నియమంబున నుండి తపంబు సల్పె
నీశుని కృపగాంచు టెన్నకొక సుందరిజేయు తపవశఃఫలంబుగా 92

కII కురులెల్ల జడలు గట్టెను
తరుణీమణి తనువు కృశతదాల్చుచు వచ్చె౯
కరుణయు లేదో హరునకు
యెరుగడొ దామరచినాడొ యెందున్నాడో. 93

వ. చెలిపలుకు లాలించి యులికిపడి తాపసి.

క॥ నిజమా చెలి పలుకులుతో
యజలోచన నమ్మజాలనని భూసురుఁడా
గజయాన మొగము గాంచిన
విజితేంద్రియ నిజమటన్న విధితలయూచెన్. 94

క॥ ఏమేమి! ఆచ్చెరువగు
నీమాడ్కిన్ గాసికోర్చి యీలాగుననా
కామారి కొరకె యంటా
యేమాయెనొ యతని గుణము లెరుగవొ తన్వీ 95

గీ॥ అంతవాడైన హిమవంతునందు పుట్టి
పేదవరునేల గోరెదో బేలనీవు
యతని గుణములఁ దెలియు కట్లాస పడెదొ
తెలియ జెప్పెద నీకు నేదెలసినంత 96

ఉ॥ మాధవునమ్మిగా గొనిన మానిత విక్రముఁడంచు నెంతువో
సాధు జనావ నుండనెడి సామెత నిక్కమటంచు నమ్మితో
సాధుడుగాడు రుద్రుడగు శాంతము లేది సుమంత నుగ్రుడా
బాధక రాజపుత్రియది బుద్ధి దలంపది దేమి చిత్రమో 97

గీ॥ ఒక్కఫలమంది కొనుటకై యుత్పలాక్షి
వృక్షమూలంబు దువ్వుదురే వెఱ్ఱులెందు
పరమమూర్ఖుని ప్రేమకై బాములంది
యధ్రువంబగు యౌవ్వనంబగుడు పడతి 98

క॥ కాముని జంపిన రసికుడు
భామిని యేపాటి వాఁడొ పరికింపు మెదన్
యేమని గోరితి వాతని!
కేమున్నది సిరియొ, కులమొ, యెరుగ రసికుడో 99

గీ॥ కన్నెజూచును రూపంబు కాంతజనని
జూచు భాగ్యంబు జనకుఁడు జూచువిద్య
కులము జూతురు బాంధవుల్ కొమ్మవెదకి
కానరావివి హరుచెంత కలికమునకు 100

క॥ ఉడుగని తలయే రెప్పుడు
కుడుచుట భిక్షాశనంబు కొండల వాసం
బుడుగుము శంకరు గోరుట
కడువడి నీతల్లి దండ్రి కడకేగు మికన్

గీ॥ మిగుల శ్రమకునోర్చి మేరువు బెకలించి
యెలుక దెచ్చునట్టు లింతినీవు
ఘోర తపమొనర్చి కోరితివే యొక్క
గుణవిహీను స్థాణు కుమతి నతివ 102

గీ॥ చేత బంగారు కొండయే చిక్కియున్న
ధనదుడే కూర్మిసఖుడౌచు దనరుచున్న
యిల్లు రజితాద్రియై విలసిల్లుచున్న
బిచ్చమెత్తునె శంభుండు బేలయెందు 103

గీ॥ చెలియనీదగు బంగారు చేలమునకుఁ
నతని చర్మాంబరము కెట్టులంటగట్టు
చందనములందు పక్షంబు చారుగాత్రి
భూతిచూసిన యురమున బొదలుటెట్లు 104

గీ॥ తోలు తొబక దినగ తోడేలు బెబ్బులి
యయిన విధము గాగ నత్రి సుతుని
తలను దాల్చి ముసలి పులిని జంపిన యంత
కలికి హరుడు గొప్పకాడు సుమ్మా 105

గీ॥ అమృతమెల్లను దేవత లారగించి
విస మొసంగిన మెసవిన వెఱ్ఱియతడు
అతని వలచెడి కన్నులీ యవనిలేరు
నిక్కముగ జూడఁ బార్వతీ నీవుదక్క. 106

గీ॥ పాములే భూషణములోలు పచ్చడంబు
భూతిగంధంబు మరి రుద్రభూమి నెలవు
వికృతమగు ఫాలనేత్రంబు వికిరభుక్తి
ఇట్టివరు గోరుకొందురే యింతులెందు 107

వ. ఇట్టిపలుకు లాలించి కటకటంబడి యక్కాటి కుంతల

ఉ॥ ఆడిన వేడిమాటలకుఁ నంబుజలోచన కర్ణ రంధ్రముల్
సూడిన యట్టులుల్కిపడి సోమకళాధరు నిందసేయగా
పాడియె భూసురేంద్ర యిటుబల్కగ వేదముబల్కనోరదె
ట్టాడెను నీలకంధరుని యంతటివానిని నిందసేయగా 108

క॥ ఈశ్వరుడను నామము వి
ప్రేశ్వర యేమిటికి గల్గె యెఱుగుదువేనిన్
శాశ్వత పదవుల నొసగు మ
హేశ్వరు నిందింప వెట్టి హేతువునైనన్ 109

క॥ పుట్టితివి బ్రహ్మ కులమున
పట్టితివట బ్రహ్మచర్య పరమ వ్రతమున్
కట్టడి యట్టుల నకటా
తిట్టుదువే దేవ దేవు దీనదయాళున్ 110

క॥ కులహీనుడు గుణహీనుడు
కలిమి విహీనంబటంచు గంగాధరునిన్
బలికితి వయ్యది నిక్కమె
తలపగ విశ్వాత్మకుం డతండు మహాత్మా 111

సీ॥ కలిమియింట సతంబుగాఁ నుండకున్నను
భూతేశ్వరుండు విభూతికరుడు
పాలింప నొక్కింత నేల లేకుండియు
వామదేవుడు లోక వందితుండు
కొలువఁగా తగవైన కులము లేకుండియు
పురవైరి దేవతా పూజ్యుడతడు
దయ సుంతయును లేక స్థాణుడైయున్నను
ప్రమదాధి పతిదీన బాంధవుండు

గీ॥ బికిరమెత్తెడితా నిరుపేదయైన
చేతజిక్కిన బంగారు శైలమైన
పారవైచిన యౌదార్య పరుడునువ్వొ
శంకరునకన్న దైవంబు జగతి గలదె 112

క॥ శివ నిందలు సేయకుమో
యనినీ సురవేద విదుడ వయ్యును నీకీ
యవివేక మెట్లు గలిగెను
సువిచార చరిత్ర నీకు స్తుతియింపవుగా 113

గీ॥ విష్ణుభక్తుండ వాదేమొ విప్రవర్య
హరిహర విభేద మొనరింప రార్యులెపుడు
వేద విదుడవు ధర్మ కోవిదుడవీవు
యెరుగవే ధర్మ సంశయం బింతవట్టు 114

క॥ ఎఱుగక యటు బల్కితివో
యెఱిగియు హరు నిందసేయ నెటు లొగ్గితివో
యెఱుగుదొ యెఱుగవొ వినునే
నెఱిగించెద యతని రూపమెరిగిన యంతన్ 115

సీ॥ కట్ట పుట్టము లేక కట్టలేమ కలాస
మతనికి శౌర్య చిహ్నంబుగాని
సింహాసనములేక చిరుత బొబ్బిలి తోలు
పీఠిగా గొనలేమ బిరుదతనికి
హర్మ్యతతులు లేక యద్రివసింపడు
ధనద సఖుఁడు సమదర్శి సుమ్ము
తారహారమ్ములు తనకు లేవనిగాదు
రుద్రాక్షసరములు భద్రదములు
గీ॥ విసమొసంగిన ద్రావెడి వెఱిగాదు
కాలవహ్నికి జగములు గలగకుండ
ద్రావెయాశ్రిత రక్షణ దక్షుడౌచు
నతని చేతలు నింద నార్హములు గావు   116

క॥ అని పలుకుచు గిరిజాత్మజ
కనుబొమ ముడివైచి క్రోధకలనను భూదే
వునిగాంచి యూరకుండెను
వినయంబున విప్రుడంత వెలదిఁ గనుచున్   117

క॥ నీమేలు గోరియంటిని
నా మీదను కోపమంద న్యాయంబగునే
భామామణి హరు జూపెద
నా మానిసి రూపురేఖ లరయుము నీవే   118

వ॥ ఇంకను బలుక నుంకించు వటువుంగాంచి
యమ్మించుఁ బోఁడి

క॥ ఓచెలి యీశ్వర నిందలు
నీచెవులఁ వినగ నొల్లనీ తాపసితోఁ
బేబాటలేల యూరక
వాచాలురతోడ బల్కవలదు మరలుడీ   119

క॥ వెఱది మహాత్ముల దూలన్
బలికిన వారలకెగాక పాతక మబ్బున్
తెలసి విను వారలకు నీ
బలు నరకము లంటిపచ్చు బనుపుండి తనిన్ 120

వ॥ అనిబలికి

క॥ రభసమున బోవనెంచిన
నిభయానన్ గాంచి బల్కెయిందు నిభాస్యా
యభవుని జూపెద నిదెమన
ముభయులు గనుగొందమతని కున్నగుణంబుల్ 121

క॥ ముందెన్నడైన జూచితె
సుందరి గుర్తింప గలవె జూచిన యెడనే
నుందునె యాతని యటులర
వింద నిభాస్యా యొకింత వీక్షింపు ననున్ 122

శా॥ ఈలీలన్ వటు వేషధారియగు సర్వేశుండు ప్రత్యక్షమై
బాలా! లీల విలోకనమ్ముల ననున్ బల్మారు వీక్షింపకి
ట్లేలా! నేలనుగాంచ నీవ్రతముచేఁ నీడెరె నీకోర్కులిం
కేలా జాలము సేయనేల గదవే యీదాసునిన్ శంభునిన్ 123

వ॥ ఈరీతి బలుకు శంకరు పలుకుల కులికి దుర్నిరీక్షణం
బైన యప్పరమేశ్వరు నిజస్వరూపంబుగాంచి

క॥ కనుగొని లజ్జమనంబున
బెనగొన మున్నిడిన యడుగు వెలది యవలకున్
నునుపగ లేకుండె కిరా
తుని రాణి యనంగ నపుడు తొయ్యలి యొప్పెన్ 124

గీ॥ అశ్రుపూరిత నేత్రయై యభవుపాద
పంకజంబులపై దృష్టి బరపిభక్తి
దీర్ఘకాల వియోగంబు దేటపడగ
వేడి నిట్టూర్పు నొకదాని వెలికి బుచ్చె 125

వ॥ ఎత్తరంగునఁ బలుకనేరక చ్చిత్తంబు శివాయత్తంబు
గావించి వినయ వినమితోత్తమాంగియై య
కృశాంగి నిలుపంబడియున్న గనుంగొని సంగోత్త
మాంగుం డిట్లనియె 126

మ॥ చెలియా నీదు తపోధనంబుననునఁ జేకొంటివే దాసుడఁ
కలయఁ జూడ ము దెల్పుమెయ్యదియొ నీకామ్యంబు సిద్ధించెడిన్
శిలయై నాదుమనంబు నీతనువు గాసిం బెట్టినానంచు నీ
కలుకో! మన్నన సేయుమంచు నిదెనే నబ్జాక్షి ప్రార్థించెదఁ 127

క॥ పలికెడి శంకరు పలుకులు
చెలువుగులుకు మధురసంబు చిలికిన యటులై
లలనకు హృదయాహ్లాదియు
గలిగించె నటన్న వింత గలదే యెందున్ 128

గీ॥ అభవు డాడిన మృధుమధురాను లాప
ములను శ్రమయెల్లవాసెనా ముదిత కపుడు
కష్టమున కీడు ఫలితంబు గలిగెనేని
కానరాదుగదా యెంత కష్టమైన 129

క॥ అంతట నగజాత్మజమది
సంతసమున దోపకేమి సఖితో నిటులన్
వింతగ బలికించెను హరు
డంతట కూర్చుండి వినగ నతి మోదమునన్ 130

క॥ చేయును కన్యాదానం
బీయువతిని తుహిన పర్వతేశ్వరుఁడు మహా
త్మాయత నిసడు గరండని
బోయిరి నిజగేహములకు బోటులు వేడ్కన్ 131

గీ॥ తపమొనర్చుటయును తముజేరి శంభుండు
పలుకుటయును బదులు వలుకుటయును
సఖియె లెల్లరపుడు సంబరంబున నద్రి
రాజునకును దెల్పి రాక్షణంబ 132

గీ॥ అలర కడగంటి వీక్షణమ్ములనుగూర్చి
హరుని శౌర్యంబు ధైర్యంబు నపహరించి
హృదయ పేటిక యందలి పదిలపరచి
పోడు నింటికి నప్పుడా పాలతిమిన్న 133

ఉ॥ శ్రీ రమణీయ గాత్ర గణసేవిత భక్తమనః ప్రయోదదే
వారజతాద్రివాస, భవ వాసవ వందిత చంద్రశేఖరా
ధీర నగేంద్ర కార్ముక సుధీజన గేయ భవాబ్ధి తారకా
వారణ గర్వ భంగశివవాయవ లింగభుజంగ భూషణా 134

శ్రీ శ్రీ శ్రీ

గద్య ఇతి శ్రీ కాళహస్తిజ్ఞాన ప్రసూనాంబికా వరప్రసాద సమా
సాదిత కవితా వైభవ శ్రీ కఱ్ఱా రామశర్మార్య తనయ
వాధూల గోత్ర పవిత్ర సుధీజన విధేయ
సరస కవయిత్రీ గంటి కృష్ణవేణీ నామధేయ ప్రణీతంబైన
గిరిజా కల్యాణంబునందు చతుర్థాశ్వాసము
సంపూర్ణము.



శ్రీ

# శ్రీ గిరిజా కల్యాణము

## పంచమాశ్వాసము

క॥ శ్రీ రమణీయ శుభాంగా
కారుణ్యాభరణ గౌరి కామిత ఫలదా
ఘోర దురితాంధ కారని
వారక శ్రీకాళహస్తి వాయువలింగా 1

వ॥ తదనంతరంబ భక్తవ శంకరుండగు శంకరుండు

గీ॥ అగజ పలికిన పలుకులే యనవరతము
వీణ మీటిన విధమున వేగిరింప
కార్య నిశ్చయుడై మదిఁ గలతఁజెంది
తలచె సప్తఋషీంద్రులఁ దలఁపునందు 2

సీ॥ తమ దేహములకాంతి తారాపథంబెల్ల
దౌతప్రభా భాసితంబుగాగ
తమ దివ్యశక్తి మాత్రమున వేరొక్క
ప్రపంచంబు సృష్టించు ప్రౌఢిమెరయ
తమ తపోమహిమ కెంతయు వినయంబున
కమలాసనుడు నూడిగములు సల్ప
తమ యోగనిష్ఠ సంతతము గూర్చిన మహా
మహిమంబు బహుతేజమై వెలుంగ

గీ॥ సృష్టి లయములు స్థితిఁగాంచి చెలగు సర్వ
సములు సప్తర్షి కులములు సంభ్రమమున
తత పతివ్రతామణి యరుంధతిని గూడి
చేరవచ్చిరి శర్వు నీక్షించుకోర్కె 3

ఉ॥ వచ్చిన మేనివర్యులను వారిజ నేత్ర నరుంధతేసతిఁ
బొచ్చములేని ప్రేమమున పూజయొనర్చె సగౌరవంబుగా
మచ్చిక మాటలాడె మది మానిని యంచు నుపేక్ష సేయకే
సచ్చరితుల్ మహాత్ములటు సల్పరుగాదె వివేధ మారయఁ 4

వ॥ అనంతరంబమ్మహాత్ములు కరపుటంబులు నిటుల తటం
బున ఘటియించి యిట్లని స్తుతియించిరి.

సీ॥ జయ జయ కలధేత సానుకూట నివాస
వాసవార్చిత పాదవనజయుగళ
జయ జయ జగధీశ చారు చంద్ర విభూష
భూషిత శేష విభూతిదాత
జయ జయ త్రిపుర రాక్షస గర్వ నిర్మూల
మూల ప్రకృతి భక్తముక్తిదాత
జయ జయ దీనార్తి జన భక్త ముక్తిదాత
దారుకావన వనితా విహార

గీ॥ జయ జయ మహేశకోటి భాస్వ త్ప్రకాశ
జయ మహాఘ విదూర భుజంగహార
జయ మహానటశేఖర చారురూప
జయ మహాముని గేయ శశ్వత్ప్రకాశ! 6

చ॥ కనకమహా మహీధర సుకార్ముక చండ విశాటి! భంజనా
త్రిన యనలోక నాయక యతీంద్ర మనోంబుజ చంచరీక పా
వనచరితా మహేశ భవబంధ విమోచన భక్తపాలనా
వనరుహ గర్భముఖ్య సురవందిత దివ్యపదాంబుజద్వయా 7

గీ॥ ఆగమ ఫలంబు శాస్త్ర విద్యాఫలంబు
దానఫలమును సత్యవ్రతంబు ఫలము
మా తపః ఫలమును నీశుమంత్రఫలము
నభవ నీ దర్శనంబున నందఁగలిగె 8

క॥ తలపగ బడితిమి నీచే
తలపగ మాయంత ధన్యతము లెవ్వరిలన్
తెలుపుము పనులెయ్యవి యో
సులలిత హృదయా యొసఁగ్వజాలదు మేనిన్. 9

వ॥ అనిపలికిన మునివరులకు కువలయ విటశేఖరుండు

గీ॥ కుంద బృందంబులను బోలు నిందుధరుని
దంతకాంతులు దశదిశల్ వసరుచుండ
బాలచంద్రుని శీతల ప్రభలచేత
మునుల శ్రమవాపి నల్లన ననియె నిట్లు 10

ఉ॥ కోరను నాకునైయొకటి కోరిక తారకుఁడింద్ర లోకమున్
కారియవెట్టి నిర్జరులు గాసిలి రక్కసు నుక్కడంపఁగాఁ
భూరి బలాఢ్యుఁడైన యొక పుత్రుని వేడిరి గాననేను నీ
హారగిరీంద్ర కన్యను మహాత్ములార వరింప గోరితిన్. 11

గీ॥ సుతుని బడయ శైలసుత నుద్వహంబాడ
నెంచినాఁడ కార్య మిదియమీర
లద్రి నడుగవలయు నగ్ని పుట్టింపంగ
నరణి దెచ్చు విప్రునట్టు మీరు. 12

గీ॥ పెద్దలొనరించు నట్టియా పెండ్లి కెందు
గలుగ వెట్టి విఘాతముల్ గానమీర
కిలుత్తముండగు హిమంతు పొత్తుమనకు
శ్రేయమగునేని కార్యంబు సేయవలయు. 13

గీ॥ శాస్త్ర మతములు ఋషికుల శాసనములు
గాన నొనరింప వలసిన కార్యవిధులు
వెఱుగ జెప్పంగ మీకు నేనెంతవాఁడ
ననుచు నభవుండు మరియు నిట్లని వచించె. 14

క॥ సకల ధర్మార్థ వేది విజ్ఞాన నిధియు
సచ్చరిత్ర యరుంధతీ సాధ్విమీకు
సాయమొనరించు సిక్కార్యసాధనమున
సతులు సమయోచితాలాప చతురమతులు 15

వ. అని యనుమతియిడి పనిపిన తదనంతరంబ వారును
ఓషధి ప్రస్థ పురంబునకు వాయు వేగంబునంజని
యందు. 16

సీ॥ చుట్టు నగడ్తలై సొంపు గుల్కుచునుండు
దేవతా భాగీరథీ స్రవంతి
సర్వోష ధీలతాశ క్తి విడంబించు
మణిశిలా ప్రాకార మండపములు
సంజ కెంజాయల చాలుకాంతి హసించు
వరగోపురస్థ పత్రవాళి దీప్తి
ఉపకంఠమున నొప్పు నుద్యానవాటిక
గంధమా దనమును కాలదన్ను

గీ॥ వెలయు బహురత్న వైడూర్య వితతితోడ
ఆ పురంబున కెనయల కాపురంబు
సంపదల దాన శౌర్యాది సంపదలను
దనకుదా సాటియైయది దనరుచుండు. 17

గీ॥ రత్నములవంటి హయములా రాజధాని
వరలు నెంతయు నుచ్చై శ్శ్రవంబులనగ
లెక్కయిడ మిక్కుటంబులై లీలవెలయు
గజముల మహేంద్రు మదగంధి గజములనగ 18

ఉ॥ అపురమందు మచ్చునకు నర్థిజ నుండనలేడు పౌరులు౯
కాపురమున్న గల్పతరుగాంచగ బోరన చిత్రమేమియు౯
దోపదు శ్రీ మహేంద్రపురితో సరియౌననబోలు నద్దియు౯
శ్రీ పతులై మహేశుపద సేవితులై వసియింతు రందరు౯  19

ఉ॥ బాలశ శాంకమౌళి పదభక్తిని బాయని వారలాపురి౯
కాలుడు స్వప్నమందయిన కాలిడ డావురి యేడువాడల౯
దూలదు జప్యనం బచటి తోయరు హాక్షు లోకింత యేనియు౯
శ్రీ లలితాంగి యా నగర సీమను బాయదు కూర్మి పెంపున౯ 20

క॥ పరిమళ మిళితములగు క్రొ
వ్విరి సరములఁగూర్చి విపణి వీధుల రసికుల్
యరుగగ బేరము లాడుచు
కరము ముదము గూర్తురుకుసుమకామిను లచట౯  21

గీ॥ ఇట్టి కల్యాణ నిలయమై యెసగునట్టి
యోషధి ప్రస్థమునుజేరి యుత్సుకమున
సప్తఋషులా యరుంధతీ సాధ్విగూడి
అంబర పదంబునందుండి యటకు దిగిరి.  22

ఉ॥ భాను సహస్రతేజమున భాసిలుచుండెడి దివ్యమూర్తులన్
మానిత దీర్ఘకాయులను మౌని పరేణ్యుల ద్వారపాలకుల్
పూనిన వేడ్క గన్గొగబోయిరి యభ్ర పదంబుడిగ్గి శ్రీ
మానితమైన యద్రివిభు మందిరమార్గము డాయనంతట౯.  23

చ॥ తన పదఘట్టనంబునను ధారుణిగ్రుంగ హిమాద్రి యంత పూ
జన మొనరింపవచ్చె తన జాయనుగూడి యపార సంతసం
బెనయగ నాతిథేయము మునీశ్వరు లెల్లర కిచ్చి యున్నతా
సన మిడి యర్ఘ్య పాద్యముల సర్వజగంబులు సంతసిల్లగ౯  24

గీ॥ గంగచేత పవిత్రత గంటిమున్ను
కాని మీకృపాబ్ధిని మున్గ గలిగినేడు
ధన్యుడనునైతి మీపాద దర్శనమున
కోర్కెలెల్లను నాకొడ గూడునేడు 25

క॥ వినయమునఁ దోషఁ జూపుచు
యనవద్య చరిత్రులైన యామునివరులన్
గొని చనియె నంతి పురికిని
వనితయు నుచితాసనముల వారల కిడియెన్ 26

గీ॥ ఊటముములేకయె పెనువృష్టి గురిసినటుల
ఫలిత మొనగూడు మీరాక వలన మాకు
పరహితము పొంటె యెద్దియో బలుకరయ్య
అరయుదును మీరు నిష్కాము లనుచుదేవ 27

క॥ ఏనును నాభార్యయు నిదె
నానోముల ఫలితమైన నాసుతమీరల్
బూనిన కార్యము లేరితొ
గానున్నవో యట్టివారి గ్రహియింతురొకో. 28

గీ॥ సమయ సందర్భములయందు సముచితముగ
మాటలాడంగ నేర్చిన మౌనివర్య
అంగిరసుజూడ నాతండు అనువుగాగ
పలికె హిమవంతుతో మృదు భాషలొలుక 29

ఉ॥ కోరినవాని కన్న పదికోటి మడుంగులు గూర్తువయ్యనిన్
ధీరుడవంచు విష్ణుడని దెల్పుచు నుందురు నీదు కీర్తి యీ
ధారుణికెల్ల వెల్లయయి దార్కొనుచున్నది యద్రిరాజ నీ
కారయ నెంత రోర్కులిడ నర్థిజనంబులు వేడవచ్చినన్. 30

గీ॥ నీరుసాను తటములట్లు నీమనంబు
యెంతొ సువిశాలమంచు మేమెఱుగ మొక్క
యిచ్చెద వటంచు మాకోర్కె నేలజెప్ప
యెఱుగమే నీదు దాతృత్వ గరిమమేము 31

చ॥ అమరులగూడి యాగముల హవ్యములన్ భుజియింతువయ్య నీ
సమమన వచ్చునే కనకశైలము నిద్ధర గౌరవంబునన్
ప్రమదముగూర్ప నీకతిన భావము కొండలయందు బెట్టి సం
యములను పూజసేయుటకె యాకృతి దాల్చితివయ్య నమ్రతన్ 32

గీ॥ పంచ భూతంబులను నీవు పట్టుకొమ్మ
స్థావరాత్మకుడవు నీవు ధన్యచరిత
సాధు ఋషివర్యులకు క్రూరసత్వములకు
సమత జూచెడి నీకీర్తి జగతి వెలుగు 33

క॥ మారాకకు నెయ్యదియో
కారణ మెరిగింతు వినుమ కల్మష చరితా
ధీరుడ వీవె ఘటింపుము
దారుడవై సేయుమయ్య దడయక దానిన్ 34

ఉ॥ యాగములెన్ని జేసినను నాకలి దప్పులకోర్చి కానలన్
యోగసమాధి నిష్టల మహోగ్ర తపంబులుజేసి యైననే
త్యాగముతోడ దానములు తద్దయు పెద్దగజేసి యేనియే
భోగి సుహారు దర్శనము బొందగ దుర్లభ మంచెరుంగుమా 35

సీ॥ రజతాచ లేశుండు రాకేందు ధరమౌళి
పరమేశ్వరుఁడు భక్తపాలకుండు
కాంచనా చలధన్వి కమనీయ గాత్రుండు
గంగాధరుఁడు నీల కంధరుండు

పురమర్దనుఁడు లోక పూజ్యుండు శంభుఁడు
మూఁడు మూర్తులకెల్ల మూలబలము
అసురాంతకుఁడు దేవతారాధ్య చరితుండు
భూతనాథుండు విభూతికరుఁడు

గీ॥ సృష్టి కరుఁడు లయకుఁడు శిష్టనుతుడు
శాశ్వతానంద కరుఁడు ప్రశాంతి యుతుడు
అగజ తపమున కుప్పొంగి యద్రిరాజ
అడుగ బనిపెను పరిణయం బాఁడదలచి 36

క॥ అయ్యా నీతో కూరిమి
వియ్యం బొనరింపగోరి విశ్వేశ్వరుడున్
నెయ్యమున మమ్ము బనిచెను
యియ్యకొనెదో యేమనందో యీశ్వరు కోర్కల్ 37

క॥ పుట్టుక లేదాతనికిని
గిట్టడు మరియెప్పుడేని గిరివాసుండో
గట్టుల దొరనీ సుతహరు
పట్టమహిషిగా నొనర్చు పదపడి వేగన్ 38

గీ॥ చదువులును బెక్కుశాస్త్రముల్ జాణతనము
వినయసౌజన్య సౌశీల్య వితతిగలపి
కుందనంబున రతనంబు గూర్చినట్లు
తగిన వరుగూర్చునాతడే తండ్రి తండ్రి 39

క॥ ఇచ్చెడి వాఁడ ద్రీశుడు
పుచ్చికొనగ నున్నవాఁడు భూతేశుడిదే
వచ్చితి మడుగ ఋషీశుల
మచ్చెరువగు నీదుపున్నె మచలాధీశ 40

గీ॥ వంశమునకెల్ల సత్కీర్తి వరల జేయు
నట్టి సంతాన మొక్కటె యైనజాలు
పుత్రుడైనను ధాత్రి సత్పుత్రి యైన
గంగచేదివి పూజ్యత గన్నయట్లు 41

క॥ కూతుల వైవాహికములఁ మాతల సమ్మతము
వలయు మహితాత్మకనీ
వీతరిమేనక హృదయం
బేతీరో తెలసి తెలుపుమీ విపుడనఘా 42

వ॥ అని పలుకు మునులకు ఆనంద పరవశుండై
హిమవంతుం డిట్లనియె

గీ॥ అమరపతిచేత మ్రొక్కులనంది కొనుచు
వెలయునా చంద్రశేఖరు లలితపావ
పల్లవంబుల నుల్లము పల్లవింప
గడిగి మాకన్య నిచ్చు భాగ్యంబు గలదె 43

క॥ తల్లియు దండ్రియు సోదరు
డెల్లరమది సంతసమున నిత్తుము తనయన్
ముల్లోక నాధునకు సుత
యిల్లాలై యుంటకన్న నెయ్యది వలయున్ 44

క॥ అరయ త్రిలోక విభుండును
పరమేశ్వరు డింద్రముఖ సుపర్వనుతుండౌ
హరునిన్ బోలగజాలెడి
వరరత్నము మాకు దొరక వలయున్ గాదె 45

క॥ ఘనులిల శుభస్య శీఘ్రం
మ్మని యందురు గాదె యింకఁ నాలస్యంబే

మనుచు నగేంద్రుడు సంతస
మును దెలుపుచు దేవిదిక్కు మొగమై యుండెన్. 46

క॥ పతిమది దెలిసి మెలంగెడి
సతి మేనక దెలిపె తనదు సమ్మతి యెందున్
పతి దేవత యెదురాడునె
పతి మాటకు నద్రియంత బహుమోదమునన్. 47

క॥ అంత నరుంధతియును దన
చెంతనె ప్రేమయును సిగ్గుచే నుండినయా
దంతిగ మన పార్వతి నిడె
యింతిం కనరాని ప్రీతి యేర్పడనొడిలో. 48

క॥ కడువడి నరుంధతీ సతి
యొడిలో నిడుకొన్న గిరిజనోడకంగ నిద్రా
న్పడినటు మేనక కన్నుల
తడి వెట్టగసాగె యేమి దలచెనో మదిలో. 49

క॥ పురములు హర్మ్యంబులు కా
పుర ముండగలేవు భుజగభూషణునకు యే
కరణి నొసంగుదు బిడ్డను
ఇరవెందని బనుపగలను యీశ్వరువెంటన్ .50

క॥ అంత నరుంధతి మేనక
చింత దెలసి యిట్లులనియె చెలియామది
నావంతయు చింతిల్లకు నీ
స్వాంతము సిద్ధించు హరుడు సర్వేశ్వరుడౌ. 51

వ. తద వసరంబున నగేశ్వరుడు.

క॥ మునికుల శేఖరులారా
యనువగు సుముహూర్త మెక్కడదగు తెలుపుడీ
తనయను హరునకొసంగెద
ఘనుతెన్నఁడు నిశ్చయింపఁగా మీకన్నన్ 52

చ॥ వినయముతోడ నద్రిపతి వేడిన మౌని వరేణ్యులెల్లనో
వినుత చరిత్ర మాటలికవేయి వచింపఁగనేల పెండ్లికిన్
అనువగు మూఁడునాళ్ళకిక నన్నియు లెస్సగ నున్నవయ్య యా
దినమున లగ్నయోగతిథి దివ్యముతారయు భూధరాగ్రణీ 53

క॥ అని పలికి మునులు హిమవం
తుని వీడ్కొని కరము ముదముతో బోయిరి శ
ర్వున కెరిగింపఁగ నంతయు
గనుగొన రాయంచలట్లు గగన పథమునన్ 54

శా॥ ఆసందేశము గొంచు మౌనివరుల య్యాకాశ మార్గంబునన్
కాసంతైనను గాసిలేక గిరిజా కల్యాణ చారిత్ర మెం
తో సంతోష మెలర్ప భూతపతికిన్ దెల్పంగ నాకాశ గం
గా సత్తీరమునందు నుండ నటకున్ గంభీర తేజంబునన్ 55

సీ॥ ముసిముసి నవ్వుల మిసమి సుధాకర
కిరణ జాలంబులఁ గేలిసేయు
ఫాలనేత్రపు ఠీవి ఫాలభాగంబున
కాశ్మీర తిలుకంబు కరణినొప్ప
విలువ హారంబుల చెలువంబురంబున
పుష్పహారములట్లు పొలుపు గులక
కటిసీమ పులితోలు కాంతులు బంగారు
పట్టు పుట్టమురీతి భాసిలంగ

గీ॥ శూలమెంతయు డాపలికేల వెలుగ
నందివాహనుడ మరేంద్ర వందితుండు
మునులగనుగొను వేడ్కన వ్వనితలంబు
చేరవచ్చెను మౌను లచ్చెరువు నంద 56

క॥ కరములు మోడ్చి ఋషీశులు
హరనీ యాజ్ఞానుసార మరిగి గిరీశుఁ
గిరిజను నీకిమ్మనుచును
నరుదారగ నడిగినార మతడీయ్యకొనెఁ 57

గీ॥ పోయితిమి యోషధి ప్రస్థ పురమునకును
మమ్ము బూజంచె తుహినాద్రి మహితభక్తి
తనయ నిచ్చెదననియె మోదమున మమ్ము
దెలుపుమనియె ముహూర్తంబు దేవదేవ 58

క॥ నేటికి శంకర మూడవ
నాటికి సుమూహూర్తమంచు నగపతితో ము
మ్మాటికి వచియించితిమా
నాటికి మనమరుగ వలయు నగరాట్ పురికిఁ 59

వ॥ ఇవ్విధంబున

క॥ ఆ మూలాగ్రంబుగ హరు
కామాట లెరుంగబల్కి యాకాశమునఁ
వామాక్షిగూడి ఋషులును
తామాశ్రమములకుఁ జనిరి తద్దయు వేడ్కన్ 60

క॥ మూడు దినంబులె శివునకు
మూడు యుగములగుచు నుండె ముద్దియపైనన్
గూడిన మోహము దెట్టిదొ
చూడగ కామారి చరిత చోద్యముగాదె. 61

వ॥ తదనంతరంబ శంకరుండోషధి ప్రస్థపురంబున
కుంజనకృత నిశ్చయుండై ప్రమధ గణంబులకెల్ల
నుల్లాసంబున ననుజ్ఞయిడి నందీశున కెఱిఁగించె న
దియు సర్వేశ్వరున కుంబ్రణమిల్లి తదాజ్ఞాను సారియై
ప్రభాతంబున ప్రమధ గణంబుల బురస్కరించికొని
ముల్లోకంబులకు గిరిజా కల్యాణంబు తెల్లం
బు గావించి యోషధి ప్రస్థపురంబున కేగ సర్వా
యత్తంబు గావించి హరున కెఱింగెంచెనంత 62

గీ॥ ప్రమధ గణము గొల్వ పరమేశ్వరుఁడు తన
నందినెక్కి శీత నగమునకును
పయనమయ్యె తోఁడ పద్మజాతులు రాగ
హరియు నమర విభుడు నరుగుదేర 63

గీ॥ దేవకా హళములు దిశలెల్ల ఘూర్ణిల్ల
దుంధుభి నినదంబు తోరముగను
మొరయ కుసుమ వృష్టి గురియంగ నభవుఁడు
దరలె నద్రిరాజు పురమునకును 64

సీ॥ ఇరువంక నొయ్యార మురణింప గీర్వాణ
రమణు లల్లన చామరములు వీవ
ఊర్వశీ మేనక లుభయ పార్శ్వంబుల
సులలితంబుగ వీణ బలుకరింప
వంధి మాగధులెల్ల ముందు స్తోత్రము సేయ
బలసి చుట్టును వీరభటులు గొల్వ
పసిడి మువ్వల తోడి పాముల్ ఘల్లన
నుచ్చైశ్శ్రవము తోడ వచ్చు చుండ

గీ॥ వామపార్శ్వంబునందు బౌలోమి వెలుగ
బంధు మిత్రులు దనుగూడి ప్రమద మరల
యిరుగెలంకుల నడువ సురేశ్వరుండు
చేరవచ్చెను తుహినాద్రి శివు కుపేక్ష 65

చ॥ అనలుడు వచ్చెశీతల నగాధిపు పట్టణమత్తు కాసినీ
జనము మదంబునొందె దనసాటన ముఖ్యసుధాశ నాళికీ
ఘనుని ముఖంబు నంగగులుగాదె ముఖంబులనెల్ల హవ్యభో
జనము లటంచు జెప్పికొని సారెకు సారెకు బ్రస్తుతింపగన్ 66

ఉ॥ కాటుక కొండబోలు దనకాయ మకాల తమంబునీ నశ్శం
గాటుక వీధి శైలపురి కాంతలు తన్గని రిచ్చనొంద నీ
నాటికి గాంచగల్గెనగ నాధుని పట్టణ వైభవంబు నే
పాటి త్రివిష్ట వంబని కృపాళుడు ధర్ముడు వచ్చెమెచ్చుచున్ 67

గీ॥ వరణు డరుదెంచె నాత్మీయ వధువుగూడి
మకరి తురగంబునెక్కి సమ్మోదము తోడ
ఓషధి ప్రస్థమునకు దానుల్లసమున
పార్వతీదేవి పెండ్లి వైభవముజూడ 68

క॥ ఎల్లర మార్గాయాసం
బల్లనదాస పనయింప నడదెంచెననన్
మెల్లన వచ్చె సమీరుడు
వల్లభయుతుడౌచు నతుల వైభవ మొప్పన్ 69

క॥ ఘనుడౌ యక్షేశ్వరుడును
జనుదెంచెను తురగమెక్కి జాయా యుతుడై
మనమున మిత్రుని పెండిలి
గనుగొన తుహినాద్రి కపుడు కౌతుక మెసగన్ 70

చ॥ ఇరుగడలన్ సతీమణుల దెంతయు కూర్మిని ముచ్చటింపగాఁ
దరుణుల వాక్యముల్ వినుచు తద్దయు ప్రీతి నెలంగ బల్కుచున్
సురవనితా లలామముల సోయగముల్ దనివారజూచుచున్
హరిసనుదెంచె వేడ్క విహగాధిపునెక్కి మహేశు పెండ్లికిన్ 71

క॥ తెలిపులుగు వజీరుండును
పలుకుల చెలితోడ వచ్చె పరమేశ్వరు పెం
డిలిగను వేడుక తోడుత
దెలుప బరాబరుల సర్వ దేవతలెల్లన్ 72

గీ॥ సర్వదేవ యుతుండౌచు శంకరుంతు
ఓషధి ప్రస్థపురిచెంత నుండుటెరిగి
అంత హిమవంతు డెంతయు సంతసమున
పట్టణంబును గైసేయ బనిపెవేగ 73

క॥ పురలక్ష్మిని గైసేయగ
పరివారము జనిరి యద్రిపనుపున వేగన్
మురియుచు పట్టణమెల్లను
నరుదార నలంకరించి రతి చిత్రముగన్ 74

సీ॥ కస్తూరి పన్నీట కలయంపి జల్లించి
ముత్తియంబులు తెలి ముగ్గువెట్టి
అతుల మణిస్తంభ తతిక నంటుల గట్టి
చలువ పందిళులు పెక్కులు ఘటించి
పచ్చల తోరణాల్ బాగుగా గట్టించి
గోపురంబుల శాతకుంభము లిడి
జాళువా బంగారుసాల దివ్వెలు వెట్టి
అందంపు వేదిక లమరఁజేసి

గీ॥ పట్టణంబెల్ల శృంగార భరితముగను
వాడవాడల యందు నవ్వారిగా గ
రమణు లెల్ల రనంగ శరంబులనగ
దిరుగు చుండిరి తుహినాద్రి పురమునందు 75

వ॥ అంత నయ్యంతిపురి దంతిగమన లింతింత యన
రాని సంతసంబున గైర విణీజార కోరకాపీడు నిం
దోడితేర నాత్మకింపగు శృగారంబుల నవధ
రింపం బూని 76

ఉ॥ శంకరుఁ దోడితేవలయు జాగొనరింపక రంతు బోవుదం
బింక నిదేమిటమ్మ యిటులీకయి సేతలటంచు నోర్తనౌ
శంకయొకింత లేక బలుజాణతనంబున మమ్ము బల్కెదీ
వింకను బొట్టు పెట్టకయె యేటికి వచ్చితివమ్మ దెల్పుమా 77

సీ॥ చెలియ బంగారంచు చేలంబు గట్టకు
చెంగావి సరిగంచు చీరకొనుము
కాంతయీా మొగ్గలకంచు కంబేటికే
రాయంచ పేటుల రైకలేదె
తరుణి యీాచామంతి విరులేల ముడిచెదు
విరిజాజి పూవ్వుల సరులులేవె
సవ్యకాంచన భూషణంబుల పెట్టకు
రమణీయ రత్నహారముల నిడుము

గీ॥ అనుచు సతులెల్ల నుచిత హాశ్యములతోడ
పలువిధంబుల గైసేసి పడతులెల్ల
మించు దీవలనంగ రాయంచలనగ
కనులు మిరుమిట్లు గొలుపగా గలిగి రపుడు 78

చ॥ చెదరెనొ నాదు నెన్నొసటి సింధుర మంచొక బాలపల్కగా
కదురుగ నున్నదమ్మయిక గొబ్బున రాగదవమ్మ జూచునా!
మదకరినెక్కివచ్చు హరి మంజుల గాత్రియటంచునవ్వుచున్
మదవతి యోర్తుబోయె నలమన్మధు శాతకృపాణమోయనన్ 79

గీ॥ నిలువుటద్దంబు చెంగట నిలిచియున్న
కన్నెగనుగొని యొకప్రౌఢ కాంతబలికె
వేయి గన్నులతో జూచు వెలదినిన్ను
నమరవిభుడేల జూతువే యద్దమిందు 80

వ॥ అయ్యవసరంబున

చ॥ అయినది ఝూము మీపొగకు లమ్మక చెల్లయిదేమి చోద్యమే
అయినవొ లేవొ పంటకములాదెస కెవ్వరుబోరు మీరలున్
బయిపయినన్ బచారములు బాగుగ జేతురు లెండటంచు తీ
వ్రయగుచు బోయె వేగమొక ప్రౌఢసతీమణి వంటశాలకున్ 81

శా॥ రేలెండెంతటి సేపెదిద్దికొనుటో లేమాయి కన్మీరలీ
జాలంబేటికి పొద్దుపోయె మనమా సర్వేశుదోడ్తేరలెన్
బూలుంపడ్లును బొట్టుగంధమును తాంబూలంబులున్ చేలముల్
జాలన్నింపుడు తట్టలందు వరపూజావేళయుండగ్గరెన్ 82

మ॥ అనుచున్ మేనక తొందరింప సఖులత్యంత ప్రమోదంబునన్
కనక క్ష్మాదర ధన్వికిచ్చుటకు బంగారంచు చేలంబులున్
మణిహారంబులు రత్నసూపురములున్ మాణిక్య కోటీర చం
దనహారిద్రపరాగ కుంకుమ ముఖద్రవ్యంబులన్ గూర్చియున్83

క॥ గిరిజా కల్యాణంబని
సరసిజ నేత్రలు మరింత సంపడిగాగన్
దిరుగుచు నుండిరి యొరపిడు
మరుశరములనంగ నద్రి మందిరమందున్ 84

క॥ మంగళరవములు మ్రోయగ
నంగన లెల్లరును వరుని నర్చించుటకై
మంగళవస్తు చయంబుల
బంగరు పళ్ళెముల నిడిరి ప్రమదమెలర్పన్ 85

వ॥ అట్టితరి

గీ॥ మేనకాదేవి కనుసన్న మెలగుచుండు
సఖియయొక్కతె యేతెంచి సత్వరముగ
పెండ్లికూతురు గైసేయఁ బిలువబంచె
అగజ దాసీజనంబుల కాజ్ఞవెట్టె 86

సీ॥ పూసిరి పదములఁ బొలుపొందు పసపును
పారాణియిడె నొక్క పల్లవోష్ఠి
వ్రాసె కస్తూరిచేఁ వలపులు గులుకంగ
మకరికా పత్రముల్ మగువయోర్తు
దీరిచె కాస్మీర తిలకంబు నొసలిపై
కాటుక యిడెనొక్కకంబు కంఠి
గట్టించె వెలలేని పట్టు పుట్టంబును
గిరికుమారిత కొక్క మెఱుగుఁబోడి

గీ॥ అలదె కర్పూర గంధంబు పొలతి యోర్తు
కట్టెముల నూలిగంటలు గరిత యొకతె
వైచె గళమున మణిసరుల్ వనితయొంత
తొడిగెపచ్చల కడియముల్ తొయ్యలికిని 87

వ॥ తదనంతరంబ

క॥ తనపరివారము గొలువగ
ఘనుడద్రీశ్వరుండు జనియె కరకంఠునిదే
ఘనవాద్యంబులు మ్రోయగ
కనక రథారూఢు డగుచు కడు మోదముగన్ 88

సీ॥ జాళువా మిసిమి పచ్చడములు దొలుకాడ
నేసుంగులోక క్రేపబూని నడువ
పసిడి మువ్వల వెల్గు పాదముల్ ఘల్లన
తురగంబు లోకవంక దరిలి నడువ
బాణ చాపకృపాణ పాణులై యొకదిక్కు
జలసి చుట్టును వీరభటులు నడువ
పటహ భాంకృతులెల్ల పలువిధంబుల మ్రోయ
అప్సరలోక యిక్క నాడుచుండ

గీ॥ కనకమయ దివ్యరథములు గణనలేక
వెంట నడువంగ చెలులతో వేడ్కమెరయ
తరలె చతురంగ బల సమేతముగ నద్రి
శేఖరుడు వరపూజ కచ్చెరువుగాన 89

వ॥ ఇవ్విధంబున ననుదెంచి సర్వదేవతా పరివృతుండగు
సర్వేశ్వరుం గనుంగొని ఆనందాశ్రు కణంబు లొలుక
హరిహర హిరణ్య గర్భులంగౌగలించి ఋషి కుల తిల
కులకెరగి దిక్పాలుర సానురాగంబున కుశల ప్రశ్నం
బుల దెలిపి తక్కుంగల వారల సముచిత సత్కారం
బుల నాశ్వసించి 90

సీ॥ వరపూజసేసె స్థావర జంగమాత్మకు
డైన సర్వేశున కద్రిరాజు
పూసె గంధము భూతి బొదలు వక్షంబున
పెట్టె ముక్కంటికి బొట్టు నొసట
వస్త్రంబొసగె చర్మ వస్త్రావృతున కంత
జుట్టెజాజులు చంద్రజూటునకును
యిడియె తాంబూలంబు లిడేరు జగముల
కభయం బొసగు భద్రహస్తములను

గీ॥ భూషణములిచ్చె పున్నాగ భూషణునకు
నిశ్చితార్థంబుసేసె యానీలగళున
కిత్తు సుతనంచు చుట్టాల యెదుట పరమ
హర్ష పరిపూర్ణ హృదయుడై యద్రిరాజు 91

క॥ ఈ రీతిఁ బూజసల్పి య
పార ముదంబునను భవుని పరివారముతో
భేరీ భాంకృతులెల్లను
తోరముగా మ్రోయఁ బురికి దోడ్కొని వచ్చెన్ 92

క॥ పురకాంతలు వెవేగము
హరునిన్ గనువేడ్క తోడనతిరభసమునన్
మరువంపు మొలక లోయను
సరళిని సౌధాగ్రములను జని రెల్లరలున్ 93

సీ॥ నంది వాహనుడంచు వినుమనేశంకరు
కరిరాజ గమనుండు కాంతయెవడు
గజరాజ గమనుండు కలికి మహేంద్రుండు
హరుని పెండిలి గాంచ నరుగుదెంచె
ఫణికుండల ధరుండు పరమేశుడనివిందు?
మణికుండల ధరుండు మగువ యెవడు?
రత్నప్రభలచేత రంజిల్లునీలంపు
చాయ గల్గినవాఁడు చక్రిసుమ్ము

గీ॥ తెలిపులుగు నెక్కివచ్చునా దిట్టయెవడు
అతడె పలుకుల చెలినాథు డబ్జవదన
తురుగమునునెక్కి వచ్చునా దొరయెవండు
అతడె యలకాపురాధీశుడభవు సఖుఁడు 94

వ॥ అని యొండొరులు దెలపికొనుచు

గీ॥ ఎంతటి పుణ్యాత్ముడో హిమ
వంతుడు దానెంత పుణ్యవతి మేనక తా
నెంతటి యదృష్టశాలిని
యింతిరో మన గిరిజ యనుచు నింతులు దమలో 95

క॥ హరిహర హిరణ్యగర్భుల
తరుణీమణులార యొక్కతరి గంటిమికఁ
తరియించె మనకు జన్మము
తరియించె హిమాద్రి గిరిజ ధన్యతగాంచెఁ 96

మ॥ అనుచుఁ భక్తిరసంబు చిప్పిలగ నయ్యబ్జాక్షులాశంకరుఁ
గనితామిట్లని ముచ్చటించుకొనిరా కల్యాణచారిత్ర ని
ర్గుణు సర్వేశ్వరు నీలకంధరుని భర్గుంగాంచి కీల్బొమ్మలో
యననాకామినులెల్ల మ్రాన్పడిరి సౌభాగ్యంబులందంతటఁ 97

చ॥ జలకములాడుచున్న యెలజవ్వని శర్వునిజూచువేడుకఁ
వలిపముగట్టి కట్టియె వారిజలోచన యోరవాకిటఁ
నిలిచి కనుంగొనెఁ హరుని నీవిక యర్ధశరీర మొక్రియన్
వలిమల పట్టికిత్తువని వంచెన బల్కెడి రీతిదోపగన్ 98

వ॥ ఇవ్విధంబున హిమవంతుడు మహావిభవంబు నం
దోడి తెచ్చి పురందరాది బృందారక సందోహంబుల నం
దంద విడియించి వారివారి పరిజనంబుల కెల్ల దగువిడు
దుల నియోగించి ఋషికుల తిలికులిడిన శుభ
ముహూర్తం బెల్లియగుటంజేసి యట్టి సుప్రభాతం
బునకై వేచియుండెనంత 99

క॥ తెలతెల వారగ జొచ్చెను
కలకలమని ద్విజకులంబు కర్ణానందం
బొలయఁగఁ బాడుచు నుండెను
తెలివొందెను దిక్కులెల్ల దివసముఖమునన్ 100

క॥ వైతాళిక బృందంబులు
గీతంబులఁ బాడి హరునిఁ గేవల భక్తిన్
ప్రాతః కాలము దెలుపుచు
నాతరి మేల్కొలిపిరెల్ల రానందముగన్ 101

శా॥ శ్రీ కైలాస నివేశ యీశంకరుణాసింధో జగద్రక్షకా
పాకారిప్రముఖ కామరార్చిత పదా పాపౌఘ విధ్వంసకా
లోకాధీశ్వర నీలకంధర రమాలోలస్తుతా రాజమౌ
ళీ కల్యాణ గుణాకరా నటనకేళీ తత్పరా శంకరా. 102

వ॥ ఇచ్చట నమ్మచ్చకంటులు చెచ్చెర నగరాట్ తనయను
మేలు కొలుప.

క॥ ఇను డుదయించును గనుమా
వనితామణి తెల్లవారవచ్చెను లెమ్మం
చన బోణి యొకతె నగరా
ట్తనయను మేల్కొలిపె ప్రేమదళుకొత్తంగన్. 103

చ॥ పలికెడి శర్వు సత్కథలు భామిని నీకడ నేర్చినట్టి యీ
చిలుకలు గోరువంకలును శీత మయూఖుని జోడుగాంచి యా
జెలజెములెల్ల విచ్చెనిక జాలముసేయక వాని గర్వమున్
దొలగెడిరీతి నీకనులఁ దోయజ లోచన విప్పు మాయికన్. 104

క॥ తూరుపు తొయ్యలి యీశున
కారతు లెత్తంగవచ్చె నాయను రీతిన్

క॥ తూరుపు తొయ్యలి యీశున
కారతు లెత్తంగవచ్చె నాయను రీతిన్
తోరముగ చదల రక్తిమ
వారెను దిశలెల్ల దెల్లవారగ సంతన్ 105

గీ॥ హారతుల నిడ్డ పళ్ళెరమందు భవుడు
కాన్కగా నిడ్డనాణెంబు కరణిదోప
అరుణ కాంతుల నడుమ భాస్కరుడు వొలిచె
అంతిపురి కాంతలెల్ల నయ్యవసరమున 106

వ॥ అహార్ముఖోచిత కృత్యంబుల నిర్వర్తింపఁ జేసి
ముంగిట మంగళ రవంబులు మ్రోయ నంగన లెల్లను
బంగారు భృంగారకంబుల నయ్యంగ జారి కభ్యంగ
న స్నానం బొనర్చ కురంటక చంపకాది సుగంధ ద్ర
వ్యంబుల నమర్చి గౌరీశంకరుల నొక్కయెడ గూ
ర్చుండఁజేసి 107

గీ॥ సుదతు లెల్లరపుడు శోభనములు వాడి
రద్రిరాజ తనయ కభవునకును
తైలమంటి నూత్న ధాన్యంబులును జల్లి
నలుగు పిండి నిడిరి చెలువు మీర 108

సీ॥ భూతి యుతంబైన పురమర్ధనుని మేన
నలుగు పిండి యొకింత చెలువు గుల్కె
జలమయంబైన శశాంక శేఖరు జటా
చ్ఛటల సంపెగ నూనె సౌరుమించె
నగ్ని నేత్రముచేత నలరుచుండెడి నొసల్
కుంకు మాంకిత మౌచు కొమరు మిగులె
చిలువ హారంబులు చెలువందు నెదపైని
పుష్ప దామములచే పొలుపుగుల్కె

గీ॥ పర్వతేంద్రుని సుత వామపార్శ్వమునను
మరకతపు బొమ్మ యోయన మెరయుచుండె
పెండ్లికొడుకయి రతనాల పీఠనుండ
నభవునకు వింత శృంగార మావహిల్లె 109

వ॥ అంత గంగోత్తమాంగుండు మంగళస్నానం బాచరించి
సర్వదేవతా పరివృతుండై కాశీయాత్రకై గదలె న
య్యవసరంబున 110

ఉ॥ కాశి గయ ప్రయాగలను గాంచగ గల్గెడి పుణ్యరాశి స
ర్వేశుడు గాశియాత్రకయి యేగెను దేవ విభుండు దిక్పతుల్
శ్రీశుడు పద్మగర్భుడును చెంగటరా ప్రమథాదులెల్ల మౌ
నీశులు మంత్రముల్ జదువ నీలగళుండు నవీన వైఖరిన్ 111

గీ॥ ఇంతు లెల్లరంత హిమవంతు తనయకు
జలకమార్చి కురుల చక్కవొత్తి
యగరు ధూపములను నార్చి పెన్నెరి కురుల్
జడ యమర్చి విరుల ముడిచి రపుడు 112

సీ॥ కీల్గంటు సరిగాదు వాల్గంటికని బల్కి
ముడివిప్పి జడవైచె ముదిత యోర్తు
క్రొవ్విరుల్ సరిగావు జవ్వనికని బల్కి
జాజి మొగ్గల నొక్కజాణ ముడిచె
తిలకంబు సరిగాదు కలకంఠి కనిబల్కి
పొలుపొంద కుంకుమ బొట్టుదీర్చె
చలువలు సరిగావు లలన కంచును బల్కి
పట్టు పుట్టంబును గట్టెనోర్తు

గీ॥ పసిడి మువ్వలు నందెలు పాముజీలు
నొక్క టొక్కటితీసి వేరొక్కటనుచు
పరువు మెట్టెల పిల్లాండ్లు బావిలీలు
పెట్టి రద్రీశు తనయకు పేర్మితోడ 113

క॥ జంగమ వల్లి యనంగను
నంగజు నస్త్రంబనంగ నమృతోదన ను
త్తుంగ తరంగం బోయన
బంగరువు బొమ్మయనగ పార్వతి యొప్పెఙ 114

గీ॥ భూషణాంబుల చేతనా పొలతి మిన్న
పొలతిచే భూషణంబులు చెలవుదాల్చె
సకల శృంగారములు జేయ చానలెల్ల
ఇంతి యొప్పారె భువన మోహిని యనంగ 115

క॥ సిగ్గులు దేరుచు నుండెడి
బుగ్గను కాటుక మెఱుంగు బొట్టిడి చెలులున్
అగ్గలమగు ప్రేమనరఙ
సిగ్గున తలవాల్చె గేలి సేయగ పడతుల్ 116

సీ॥ నీదు పెన్నెరివేణి నెలతరో గనుగొన్న
శివుని హారంబులు చిన్నబోవె
కలికినీ నెన్నొసల్ గనినంత సిగ్గుచే
శశిఖండ మభవుని జడల బడదె
సుదతినీ చిరునవ్వు జూచినయంతనే
భవుడు మోహాబ్ధిలో బడకయున్నె
చెలియ నీకన్నుల చెలువంబు గనినంత
నీకు దాసుడుగాడె నీలగళుడు

గీ॥ లలితమును మధురమ్ము నీపలుకెవిన్న
మరుని జంపిన శౌర్యంబు మాసిపోదె
అనుచు ప్రియసఖు లెల్లరయ్యతివగాంచి
యుల్లసములాడు చుండి రన్యోన్యమునను 117

గీ॥ కాశియాత్రకు హరుడట గదలు టెరఁగి
సతిసుతామాత్య ఋషి బృంద వితతిగూడి
తోరముగ దుంధు భిధ్వాన తూర్యరవము
సెలగ నెదురయ్యె హిమగిరి చిత్తమలర 118

చ॥ ఎదురయి కాశియాత్ర కిపుడేటికి బోవలెనయ్య శంకరా?
ఇదెగొను మంబరంబులును నింపగు దివ్యరథంబు లశ్వముల్
మదకరులున్ సుభూషలును మానిత కాంచన పాదుకద్వయిన్
ముదితనొసంగుదున్గొనుముమోదముతోమ ముద్ధరింపగన్ 119

క॥ ఒంటిగనేటికి హరవాల్
గంటిని జేకొమ్ము పిదప కాశీ యాత్రల్
జంటగ జేసినఁ బుణ్యము
రెంటగ జేకొందువనుచు శ్రీశుడు బల్కెన్ 120

క॥ కనుగొననిది తగవౌనని
వజానక్షు సుతుండు బల్కె వాసవు డంతన్
ననువౌ శ్రీహరి పలుకులు
ననె దేవతలెల్ల నగిరి యంబర మద్రువన్ 121

క॥ ఘనుడగు నీయద్రీశుడు
తనయను నీకిత్తునంచు ధారాయుతుడై
జనుదెంచి వేడి కొననీ
కనువే గైకొనక యుంటయనె కమలజుడున్ 122

క॥ ఉత్తము లెయ్యది తమకై
చిత్తము నందాసబడరు శీతాంశుధరా
యిత్తుమని యొరులు బలికెడి
అత్తరి చేకొనుట యుచితమనె నారదుడున్ 123

గీ॥ కాశియాత్ర వలదు కరకంఠ వినుము మా
కన్నెనిత్తు మనుచు గారవమున
పరమ శివునితోడ బల్కి యద్రీశుండు
తూర్యరవము సెలగఁ దోడితెచ్చె 124

క॥ పట్టెను శ్వేత చ్ఛత్రము
బెట్టెను పాదుకలు వేదవేద్యున కెదలో
నెట్టిన భక్తిని నపుడా
గట్టుల దొర తనయుడెంతొ గారాబముగా 125

క॥ బంగరు చెంబుల జలములు
పొంగుచు మేనక యొసంగ పుత్రుడు దానున్
గంగాధరు చరణంబులు
మంగళముగ గడిగిరయ్య మరులు పొగడగన్ 126

గీ॥ పులుగురా తోరణంబులు చెలువుగులుక
కనక రంభాతరుల్ రత్న కలశములును
వెలయ మణిమయ దీపముల్ వేనవేలు
వెలుగు కల్యాణ వేదికన్ వెలసె శివుడు 127

సీ॥ ఒకవంక గంధర్వ నికరంబు బాడంగ
నప్సరోంగనలు నాట్యములు సేయ
ఒక చక్కినుండి గుహ్యక సమూహంబులు
నీం కంధరు కథానికలు బాడ

ఒక ప్రక్క ద్విజ్బృంద ఒమకలంకముగ బల్కు
వేద ఘోషలు విను వీధి (కెగయ
ఒకక్కెడ దిక్పాలు రున్నతాసనముల
దీపిమై నుపవిష్టులై వెలుంగ
గీ॥ ధాత హరియును పెండ్లి పెద్దలుగనుండ
సప్తఋషికుల తిలకులు సంభ్రమమున
తన పురోహితులైయుండ కనులపండు
వగచు చెలువారె కల్యాణ హర్మ్య మపుడు 128

వ॥ అంత హిమవంతుని యోగంబున నరుంధతీ ముఖనిఖిల పురంధ్రీ జనంబులు అంతః పురంబు కుంజని సామాన్య కన్యకా జనంబు కైవడి సర్వమంగళం బూజించు శర్వాణిం గని మంగళ రవంబు సెలంగ భూసు రాశీస్సులతో బేర టాంద్ర మంగళ గీతికా రవంబు లొక్కుమ్మడి సెలంగ కల్యాణ మంటపంబునకు దోడ్కొని వచ్చిన 129

సీ॥ పులుగురా కమ్మల వెలుగులు నిద్దంపు
చెక్కుటద్దంబుల చిందులాడ
బంగారు చాయల రంగారు పుట్టంబు
కుచ్చెళ్ళు పదముల గొమరు మిగుల
సరిగంచు భరమున జారుపయ్యెద కొంగు
వడతులు కరమున బట్టినడువ
తన పాదముల( చుట్టుకొనివచ్చు కెంజాయ
ధరణీస్థలిని శోణితంబుసేయ
గీ॥ భానుదీప్తి వెలింగెడి బాసికంబు
గదలు చుండగ గందేభ గమనతెల్ల
చుట్టుకైదండ యిడగ నాసుదతివచ్చె
పరమ శివుడున్న పీఠంబు వజ్జకపుడు 130

సీ॥ మణిమయ మంజీర మంజుల నినదంబు
హరుని ధీరత్వంబు నపనయింప
కాంచన మణిమయ కర కంకణధ్వనుల్
కామారి ధైర్యంబు కడకుదోఁప
మొలనూలి చిరుగంట మ్రోతలు సర్వేశు
వలరాజునకు వశం వదుని సేయ
అళి బృందముల కప్పులఁ ణగించు చెలికొప్పు
భూతేశు మోహాంధ్యమునను ముంప

గీ॥ చామరము లిరుపంకల సఖులువీవ
మానితంబైన కల్యాణ మంటపమున
కమరులెల్లరు నిశ్చేష్టులై కనంగ
తరలి చనుదెంచె పర్వతేశ్వర కుమారి 131

క॥ జనకుం డనుమతి యిడనా
వనితయు గూర్చుండె తండ్రివద్ద ముదమునన్
మనమున హరుగను వేడుక
బెనగొన తలవాంచి సిగ్గు పేర్మినిఉండెన్ 132

క॥ హరుజూడఁ మదిఁ దలంచును
హరుడును దను జూచుచుంట నరసి మనమునన్
దొరకొను సిగ్గున జూడక
సరసీరుహ నేత్రయపుడు జాణ తనమునన్ 133

గీ॥ నిటలతట బాసికము దిద్దు నెపముచేత
కుటిల కుంతలముల దోఁసికొను నెపమున
హెూమ ధూమంబుచే కనులొత్తికొనెడి
కారణంబున కడకంట గాంచుచుండె 134

గీ॥ అంత సుముహూర్త మేతెంచెనని ఋషీశు
లెరుగ బల్కిన హిమవంతు డీశ్వరునకు
కన్యకాదాన మొసగగా గడగియంత
నిచ్చె షోడశ దానంబు లివ్విధమున 135

సీ॥ మరకత మాణిక్య మయమైన సింహాస
నంబులు దశ సహస్రంబులిచ్చె
కామధేనువుతోడి కయ్యంబునకు వచ్చు
గోగణంబుల నొక్క కోటియొసగె
తపనీయ దివ్యసంపన్నమై యొప్పారు
కనక రథంబుల కాన్కనిచ్చె
గంధ సింధుర మతంగ శతంబుల
దాసీ సహస్రంబు దానమిచ్చె

గీ॥ రత్నకుండలముల నవరత్నములతో
నలరుచుకిడెడి యంగుళీయకము లొసఁగె
పట్టు సరిగంచు చెలముల్ భక్తినొసఁగె
అభవునకు కన్యనొసగి ధన్యాత్ముడయ్యె 136

గీ॥ కంబురేఖావిలాస మంగళమునైన
సర్వమంగళ గళమున శంకరుండు
గట్టె మంగళ సూత్రంబు కడుముదమున
ధన్య మూర్ధన్యయగు నరుంధతి యొసంగ 137

చ॥ త్రిపద నివాసులౌ నిఖిల దేవగణంబులు సాక్షిగాగనే
నపగత పాపపంకిలుడ నాశ్రిత వత్సలుడైన చంద్రమౌ
ళి పదపవిత్ర తోయముల లీల ధరింపుచుఁ గన్యనీయగా
తపము ఫలించె నేనిపుడు ధన్యుడనైతి తరించె వంశముౘ 138

క॥ పెనుజరి భాకము చేతను
ఘనమగు చనుగట్లత్రోపు గలఁగుఁ జేతన్
వనితలు జారెడి పయ్యెద
లనువుగ జేర్చుచును దెచ్చిరట తలఁబ్రాలన్ 139

గీ॥ మూడు దోసిళ్ళ ముత్యముల్ ముదితపోసె
బోసె శివుడంత తలఁబ్రాలు మురహరుండు
కన్ను సన్నల పరిహాసకములు సేయ
నమ్మహీంద్రులు సంతోష జలధిమున్గ. 140

క॥ పాడిరి గంధర్వులు మరి
యాడిరి యచ్చరలుఁ గూర్మి నమరవరులు గొం
డాడిరి వృద్ధపురంధ్రులు
పాడిరి శుభమంగళములు ప్రస్ఫుట ఫణితిన్ 141

గీ॥ పార్వతీదేవి తలఁబ్రాలు పరమశివుని
మస్తకముపై వెలుంగ సమస్త జనుల
కనుల కప్పుడు దోచె చుక్కలుగ నదియు
సొబగుగానుండె వ్యోమ కేశుఁడుగాన. 142

క॥ తలఁబ్రాల్ బోయించియునా
లలనామణి సన్నెకంటి లాంఛనమునకున్
చెలియలు దోడ్కొని చనిహరి
పలుకుము విడనంచు చెలెయ పాదములానన్. 143

క॥ అని యుల్లసంబు లాడుచు
వనితా మణులెల్ల రచట వచ్చినవారిన్
గని మర్యాదల నడపుచు
ననిపిరి విడిదిండ్ల కెల్లరతి రభసమునన్. 144

ఉ॥ వేళ యతిక్రమించె నికవేగమ బువ్వము బంతిదీర్పుడీ
జాలము చేయకంచు నొక చంద్ర నిభాననబల్క నెల్లరుణ్
మేలిమి తామరాకులను మించెడి బంగరు పళ్ళెరంబులున్
చాలుగనుంచి హేమకలశంబుల గంధజలంబు లుంచినన్1. 45

వ॥ వాలఖిల్య శౌనకాది వర్గంబు లొక్కబంతియు,, పాకారి
ప్రముఖ నిఖిలామరు లొక్కచక్కియు, గరుడ గంధర్వ
యక్షకిన్నర, కింపురుష, సిద్ధ, సాధ్య, విద్యాధరు లొక్క
యిక్కయు, ప్రమథాదు లొక్కబంతియు నలంకరించి
యుండ, సకల కల్యాణ దాయకులగు నయ్యాది దంపతుల
మణి మయాసనంబుల గూర్చుండ నిడి రంత దంతిగమన
లింతింత యనరాని సంతసంబున, నింబ, జంబీర,
మధుర మాకంద కదళీ కపిథ ఖర్జూర పనస ద్రాక్షా
గుళుచ్ఛంబులాదియౌ బహువిధ పరిపక్వ ఫలరసంబులును
అనూన శాకాపూప భక్ష్యభోజ్య లేహ్యంబులు
ను కలమాన్న క్షీరాన్నదధి గోఘృతంబులును వివిధ
విధంబులగు వంటకంబులనెల్ల కొమ్మ లెల్లరలు జం
త్రపుం బొమ్మలోయన పరిహాస వాక్యంబులనయ్య
మరానీకంబునకు బంతులు సాగించుచూ 146

సీ॥ మీకల్పవృక్షంబు మీవగాయవు సుమీ
యీ నిమ్మలని యొక్క యిగురుంబోడి
నందనా రామంబునందు పండవు గొనుం
డీ మావివండ్లని నింతియొకతె
మీయూర లేవిట్టిమేలి మాజీ ఫలం
బులు జూడుడని యొక్క పోడబలికె
మీపొలంబుల నివి చూపట్టునే గోస్తు
నీలాఫలని యొక్క నెలత కొసరి

గీ॥ యిటుల వియ్యపువారి నయ్యిందుముఖులు
పలుకు పలుకున నొయ్యార మొలుక జలికి
పలువిధములైన పరిపక్వ ఫలములెల్ల
వడ్డన లొనర్చిరంత నవ్వారిగాగ 147

క॥ కలకల నవ్వుచు వేల్పుల
చెలియలు పరిహాసములను సేయుచు రుచియౌ
పలుదెరగు వంటకంబుల
నలయక వడ్డించి రంత యతివలు వేడ్కన్. 148

గీ॥ పాయసాన్నంబు లిటుదెమ్ము పద్మగంధి
యనుచు నడుగంగ వడ్డించె నతివ యొకతు
చియ్యగా నున్నదే యిది తెలుపుమన్న
బలికె వాతె రసంజ్ఞ నప్పుడతిమిన్న 149

చ॥ వలసిన శాకపాకముల వారిగ నుగ్గువి యొవ్వగాపలెన్
తెలుపుడు దెత్తు మాసుధను తియ్యగ ద్రావిన నోటి వెక్కసం
బులువడి బోవురీతి తగు గారెలు బూరెలు వంటకంబులున్
కలయగ జూపెనెల్లరకు కాంతయొకర్తు మిటారి చూపునన్ 150

గీ॥ విసము దిన్ననోట కసటయ్యెగా నోపు
భక్షణంబులెల్ల పార్వతీశ
అట్టి దివ్యమైన ఆహారములులేవ
టంచుబల్కె విష్ణు డభవుగాంచి 151

ఉ॥ నిక్కము నీవు బల్కినది నీరజనాభ యిటెందు ద్రుచ్చిలన్
జిక్కనె వెన్న దెత్తుమన జక్కవు యెంగిలి కాయలెందు నీ
చక్కట నీకునట్టి కెలసంబును దీర్చెడి వారు లేరికన్
నెక్కడదెత్తు మియ్యెయవి యిప్పుడటంచు శివుండు నవ్వెనన్.152

గీ॥ వండి వడ్డింప చొకనాథు వనితనీకు
నుండు తలవాకిటనె గాననో విధాత
భుక్తి సల్పుము యిప్పడే బొజ్జనిండ
ననుచు పరిహాసమాడె బ్రహ్మను మురారి! 153

వ॥ ఇవ్విధంబున భక్తజన వశంకరుండగు శంకరునితో విందా రగించి చందన తాంబూలంబులంది యమందా నందంబ నమందిరంబులకుం జనిరంత యింతులెల్ల శరుం ధతీ ప్రముఖ పురంధ్రీరత్నంబులుఁరాఁ బౌలోమి పద్మ పద్మజురాణి పరిసరంబుల సరుదేర గారాబు నెచ్చెలు చేయి పట్టి తోడ్కొని చని యిందు వదన శయ నాగారం బు చేరంజని కందర్ప జిత సుందరుండగు నిందుధరు ని హంస తూలికా తల్పంబునఁ గని బిబ్బో కవతి యగ్గ లంబగు సిగ్గుచేఁ తలవాల్చి నిలిచియుండ గిరిజనుగని కరంబు గారవంబున. 154

క॥ ఎఱుగడు నీపతె నేరుపు
తరుణీమా శంకరుండు దయతో నీపి
తరిజూడకున్న దోసం
బరవింద దళాక్షి నీదెయనె కమలజయుఁ 155

క॥ స్థాణువు మాశంభుండో
యేణాక్షి కపట నటన లెరుగడు నీవా
జాణవు నేర్పుమతని కని
వాణియు శర్వాణి సరస వచనము లాడెఁ 156

క॥ లిలనా సిగ్గేల యికఁ
వలచితి వలపించు కొంటి వశుడయ్యెనిదే
దలవాల్చి నిలువ నేటికి
చెలియాయనె కన్నుసన్న శశి వేడుకగా 157

గీ॥ బాలబేల వెఱ్ఱిగోల యీాలలితాంగి
ముగ్ధయెఱుగ దేమి ముద్దురాలు
కరుణతోడ నీవు గారవింపు మటంచు
బలికె గిరిజ కూర్మి పడతి యపుడు 158

సీ॥ పతివచ్చు వేళాయె పడతినే బోవలె
నంచుబోయె నొకర్తు మించుబోడి
పసిబిడ్డ లేడ్తురు భామనే బోవలె
నంచు బోయెను నొక్కయంచగమన
మాయత్త గోపించు మగువనే బోవలె
నంచు బోయె నొకర్తు చంచలాక్షి
కడుదప్పు మావాడ కాంతనే బోవలె
నంచుబోయె నొకర్తె యబ్జవదన
గీ॥ ఇటుల నొక్కొక్క రేపున నింతులెల్ల
బోవుటను గాంచి పార్వతి బోటితోడ
వెడలి చనుదెంచుటను గని వెలది కష్టడు
బలికె నీరీతి కూర్మిమై ప్రౌఢయోర్తు. 159

గీ॥ నీతపః ఫలమౌగాదె నీలగళుడు
యేలయిటు జాగుసేయుదే యిందుధరుని
మనసు నొప్పింప తగునటే మగువనీకు
వినుము నామాట చెలియసిగ్గ వేడుకొందు. 160

సీ॥ చెయిపట్టి దిగిచిన చెంతకు బోవమ్మ
పలుకరించిన మారు బలుకుమమ్మ
పనియేమి చెప్పినఁ బడతి సేయగదమ్మ
యతడు నవ్విన మది నలుగకమ్మ

పరిహాసముగ నెద్ది బలికిన మాత్రాన
కోపింపగా నీకు గూడదమ్మ
కర్పూర విడియంబు గంధంబు విరిసరుల్
బింబోష్ఠి హరున కర్పింప వమ్మ
గీ॥ బహు విధములైన ఫలములు భక్తితోడ
యొసగుమా తేనియనుగూర్చి యుత్పలాక్షి
అతడు రతిపతి జిత సుందరాంగుడమ్మ
అతని మది రంజిలగ నుండవమ్మ కొమ్మ. 161

క॥ అలయించకు మమ్మూరక
కలయించకు పతిమనంబు కలికీ నీతోఁ
బలుకము మాపలుకులు విని
యలగిన నాతోడు నుమ్మియని కోపమునన్ 162

క॥ పలికిన చెలి నెమ్మొగమును
పులుకు పులుక్కనుజూచి భూమిన్ గనుచున్
తలవాల్చి పైచెరంగును
చెలి వ్రేళుల జుట్టికొనుచు సిగ్గున నుండెన్. 163

క॥ వలదని యెందరు బలికిన
వలదని నీతల్లి జెప్పి వారించినయో
చెలియా తపమున కేగిన
పలపిప్పుడదెందు బోయె వచియింపు దయన్. 164

ప. అని బలుకు చెలి పలుకెల్ల.

చ॥ ఎలవగ వంకురింపగను నిందు కలాభరణుండి దంశయున్
కలయగ జూచుచున్న తరికాంత యొకర్తు మహేశు పాలికిన్
వలిమల ముద్దుపట్టి గొనివచ్చి కరంబు కరంబు జేర్చుచున్
బలికె, మహేశ మాచెలియ బాలయొఋంగ దదెట్టి లీల.లన్ 165

క॥ అని బలికెడి చెలిపలుకులు
విని యొక్కతె వేగవచ్చి వెలదీయ వలఁ
పని గలదురండు బోవతె
నిను బోలిన జతుడుగాడు నీల గళుండుఁ. 166

గీ॥ నేర్చుకొను నతండె నెఱజాణ డన్నియు
నీవు జెప్పనేల నిఖిల మెఱుగు
యనుచు నొక్కకాంత యపలకు గొంపోయె
జనిరి బోటులెల్ల సంభ్రమమున 167

ఉ॥ బాల శశాంకమౌళి జతబాయక దీర్ఘ వియోగ వేదనఁ
యాలల నామణిం దవిలియుంతకు నంతకు రాగరక్తుడై
దేలి సుఖించె వేల్పులకు దీనత వాసె ననంగదూర్పునఁ
లాలిమదోచె పార్వతియు లజ్జ బెనంగొనగాంచె శర్వునిఁ. 168

క॥ సురవర సన్నుత చరణా
పరమేశ్వర భక్తవరద పాపవిదూరా
గిరివర తనయా వల్లభ
వరదాయక కాళహస్తి వాయుపలింగా 169

క॥ శ్రీ జ్ఞానాంబా వల్లభ
అజ్ఞాన తమః పతంగ యసురాంతక ధి
వ్యజ్ఞానంతన దీపిక
ప్రజ్ఞాన బ్రహ్మదేవ వాయువలింగా 170

చ॥ భవభయ బంధమోచన విభాసిత ఫాల విలోచనా మనో
భవ వరగర్వభంగ సురవందిత మౌని మనోజ్ఞభృంగ మా
ధవశర చండకార్ముక విదారిత దానవగర్వ శైలజా
ప్రవిమల మానసాంబురుహ వాస మహేశదివేశవందితా. 171

క॥ గిరిజా కల్యాణంబే
తరుణులు సద్భక్తి జదువ తప్పక వారల్
స్థిరమగు మాంగల్యంబును
సిరి సంపద మోక్షలక్ష్మి చేకొందురొగిణ 172

గద్య

ఇతి శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా వరప్రసాద సమాసాదిత
కవితా వైభవ శ్రీ కణ్ణూ రామశర్మార్య తనయ
వాధౌల గోత్ర పవిత్ర సుధీజన విధేయ
సరస కవయిత్రీ బిరుదాంకిత గంటి
కృష్ణవేణీ నామధేయ ప్రణీతంబగు
గిరిజా కల్యాణంబున పంచమా
శ్వాసము సర్వంబును
సంపూర్ణము.



ప్రకాశ్ ప్రింటర్స్, ప్రొద్దుటూరు.